# ఆంధ్ర
# కథాసరిత్సాగరము.

వేంకటరామకృష్ణప్రణీతము.

ఓమ్ !

# ఆంధ్ర కథాసరిత్సాగరము.

## నరవాహనదత్త జననలంబకము.

---

## ప్రథమ తరంగము

---

శ్రీరంజిత పీఠపురీ
భూరాజ్యధురంధర ప్రభూత యశ స్సూ
ర్యారాయాత్మోద్భవ ! రా
మారాయా ! సత్కవిత్వ మర్మజ్ఞమణీ ! 1

తే. అనవరత భారతాది మహాపురాణ
పఠనరంజిత పరిశుద్ధభావులార !
విషయగౌరవ విజ్ఞాన విమలధీ ప్ర
శస్తులారా ! త్రిలింగదేశస్థులార ! 2

మ. హరవక్త్రాంబుధిఁ బార్వతీప్రణయమంథాద్రి భ్రమాందోళన
త్వర మున్ పుట్టిన యిక్కథామృతము నాస్వాదించువారెల్ల ని
ద్ధర నిర్ధూత సమస్త దోషులయి నిత్యశ్రీలఁ బెంపొంది సు
స్థిర వైబుధ్యముఁ దాల్ప నేర్తురు మహాదేవప్రసాదంబునన్. 3

వ. కావున భావుకం బైన యీ యనంతరకథావిధానంబును సావ
ధానంబుగా నవధరింప ననుగ్రహంబు సేయుం డదియెట్లనిన:-

ఉ. ఇంబుగ వత్సభూమిధవుఁ డిట్లు నిజార్జిత సర్వభూమిరా
జ్యంబును నేకసుస్థిరసితాతపవారణయుక్తిఁ గాఁగఁ గౌ
శాంబి వసించుచున్ బహుసమస్థితి నేలుచు దివ్యభోగభా
గ్యంబులనొందుచుండెహితులై తనరాజులుకొల్చుచుండఁగన్.

క. మహిత మహీభరణకృత్యము
ను హితుఁడు యౌగంధరాయణుండు రుమణ్వ
త్సహితుండై నెఱవేర్పఁగ
నహితభయాశంక లేక యతఁ డవ్వేళన్. 6

వ. వసంతకసఖుండై కొంతతడవు విహారైకాభిలాషంబునఁ
బ్రొద్దుపుచ్చుచు, మఱికొంతతడవు తనయంతం దాను వీణా
వినోదంబుఁ గావించుచు, నిజవిపంచికానిస్వనవ్రాతంబునకును
దేవీద్వితయకాకలీగీతజాతంబునకును భేదసూచకం బైన వాద
నాంగుష్ఠప్రకంపంబ తక్క వేఱొక్క తారతమ్యంబు లేకుండ
సంగీతకంబు సేవించుచు, స్వకీయనిర్మలకీర్తిపూరంబుచేతనుం
బోలె విశుద్ధచంద్రికాసారంబుచే నత్యంతపాండురంబు లైన
హర్మ్యాగ్రభాగంబుల విశిష్టోపభోగంబులం బడయుచు,
ధారావిదళితం బైన రుచిర మద్యంబు నతిహృద్యంబుగా
శాత్రవ జన మదంబునుంబోలె ముదంబునం గ్రోలుచు, మివుల
సోలుచు, స్మరరాజ్యాభిషేకతోయంబుతోయంబున రాగో

జ్వాలం బైనమధురతరసుధురసంబు మరలమరల మంతనంబునఁ గమనీయ కనకమయ పాత్రింబుల విలాసవిభ్రమపాత్రింబులగు వారాంభోరుహాపత్త్రవిశాలనేత్రి లందింప నారక్త సురసస్వచ్ఛంబు నంతఃస్ఫురితతన్ముఖంబు నగు నమ్మధువు నిజహృదయంబునుంబోలె దేవీ ద్వయ మధ్యంబునం బొల్పుగ నెలకొల్పుచు, నీర్ష్యారోషావేశలేశంబులేని లేశయుండియు భంగురభ్రూమనోజ్ఞంబులును రాగయుక్తంబులునై యొప్పు మిగులు నప్పొలంతుల తులలేని నెమ్మొగంబుల సోయగంబులం గనుంగొని నిజనయనభ్రమరంబులుతనియక సంభ్రమణభ్రమణంబులు సేయుచుండ, భోగైకపరాయణుండై యుండుటయు నట్టి సమయంబున మధురసాపూరితస్వచ్ఛస్ఫటికమయానేకచమకమై యొప్పు నప్పుడమిఱేని పానభూమి బాలాతపారక్తసితశతపత్త్రియైన పద్మినియుం బోలె విలసిల్లుచుండు; మఱియుం గొండొక కాలంబు లక్ష్యవేధులైనవ్యాధజనంబులంగూడి పలాశశ్యామకంచుకత్వంబునను సబాణాసనత్వంబునను దన్నుఁ బోలి యొప్పుచుండు మృగకాననంబుల కరిగి. 7

క. కర్దమ రూషిత బహుతర
దుర్దమ వారాహమును విసుర్చు శరములన్
మర్దించి, యినుఁడు కరముల
నిర్దళితముచేసి తమము నెఱిచెఱుచు క్రియన్. 8

వ. మఱియు నట్టి సమయంబులయందు. 9

క. ఆ నృపుఁడు వనులఁ జొచ్చెడు
చో నటఁ దగు, బెదరి పాఱుచు హరిణములు ఘ్రా
ణావమాన తిరస్కృతి ది
జ్మానవతీ చల కటాక్ష మండలములు నాన్. 10

వ. ఇదియునుం గాక. 11

తే. అ న్నృప నికృత్త మహిష ర క్తమున రక్త
మైన వనభూమి విలసిల్లు నతఁడు తనకు
నన మహిష శృంగపాతంబు వదలఁగొట్టె
నని యుబ్బరి కొల్వఁ జను వనాబ్జినియుఁ బోలె. 12

చ. తెఱచిన నోళ్ళ నీఁటియల దీటుగ నాటఁగ లోని ప్రాణముల్
తెరలుచునున్న గర్జితరుతిన్ విడఁబోకయె కూలి ధాత్రిపైఁ
బొరలెడు మేటిసింగముల పోటుమగంటిమి చూచిచూచి య
చ్చెరువును సంతసంబు మదిఁ జెందుచునుండు నతండు
మెండుగాన్. 13

వ. ఇట్లు. 14

ఆ. వె. వేఁటపనులు తనదు వేఁడితూఁపులఁ దీఱు
చుండ జాగిలములు నోదములును
వలలు నతని కాఱె వైభవోచిత సాధ
నముల యగు వనీపథములయందు. 15

వ. ఇవ్విధంబున నవ్వత్సరాజు నిరంతరమృగయామధుపానాది
సుఖోపభోగంబులం దవిలియుండి యొక్కనాఁడు నిజాస్థాన

భాగంబు నలంకరించియుండ నంత దేవలోకాలంకారభూతుం డును బ్రహ్మగర్భసంజాతుండు నగు నారదమహామునీశ్వరుండు నిజదేహప్రభాబ్ధములం దేలుచుఁ దద్దె నభోమార్గంబునుండి యవతరించి, తేజస్విజాత్యభిమానవశంబునం జను దెంచిన యంతు మంతుండునుంబోలె నమ్మహీకాంతు సంతికంబున కరుగు దెంచి యుతండు తనకత్యంత భయభక్తి వినయాతిరేకంబులు రేకెత్త నుత్తమాతిథ్యసత్కారంబు లొనరింపఁ గైకొని సుప్రీ తాంతరంగుండై కొంతతడ వుండి యతని కిట్లనియె. 16

క. మహీపాలకులోత్తమ! సం
గ్రహముగ నీ కిపుడు నే నొకటి సెప్పెద నుం
టి; హితం బగు నీకది; సమ
వహితమతిఁ దాని నీ వవధరింపఁగ దే! 17

క. మహి మును నీపూర్వపితా
మహావర్గమునందుఁ బాండుమనుజేశుఁ డనన్
మహితుఁ డగు నొక్క నృపధూ
ర్వహుఁ డిద్ధర నేలుచుండువాఁ డుజ్జ్వలుఁడై. 18

తే. అతనికిని నీకుఁ బోలె భవ్యతము లైన
మహిషు లిర్వురు కుంతియు మాద్రియు ననఁ
బరఁగుచుండెడువార; లప్పాండురాజు
వారితో సర్వభోగముల్ వడయుచుండె. 19

క. చతురబ్ధిమేఖలావల
యితమై విలసిల్లుచున్న యిమ్మహనీయ
క్షితితల మంతయు విజయా
ర్జితముగఁ జేసికొని ముదితచిత్తుం డగుచున్. 20

క. అసదృశవిక్రముఁ డతఁ డొ
క్క-సమయమున మిత్రులఁ గౌతుకముతో మృగయా
వ్యసని యయి వనమునకుఁ జని
కసిమసఁగఁ దొడంగె నచటఁ గలమృగసమితిన్. 21

వ. ఇట్లవ్వసుంధరావల్లభుం డను మృగమారణవినోదంబుఁ గావించుచుఁ దత్సమయంబున. 22

క. కిందముఁడను ముని, తన సతి
యుం దానును మృగశరీర మూని రతిక్రీ
డం దవిలియుండ వారల
మ్రందంగా నేసె ముక్తమార్గణుఁ డగుచున్. 23

తే. అంత నమ్ముని మృగరూప ముడిగి తొఱంగి
కంఠగతజీవితుండయి, కడు విషాద
వశతఁ దనుఁ గని విలుపీడి వైచి భయము
నిగుడ నివ్వెఱఁగందు తన్నృపతిఁ గాంచి. 24

క. స్వైర విహారంబున నో
భూరమణా ! నిర్విమర్శముగ న న్నిటు లీ

ఫ్రూరక నధిగించితివి త
త్కారణమునఁ జేసి నీవుఁ గడు శీఘ్రముగన్. 25

క. నావలె భార్యాసంభో
గావసరమునందు మరణమందుదు వని కో
పావేశమున శపించుచు
జీవములం బాసి ముక్తిఁ జెందం జనియెన్. 26

వ. అంత. 27

ఆ. వె. అట్లు లాత్త శాపుఁడై పాండు నృపతియు
భీతి భోగవాంఛ విడిచి యాత్మ
సతులతోడ సుప్రశాంతతపో వన
స్థలిఁ జరించుచుండె సాధువృత్తి. 28

తే. అతఁ డట నట్లు లుండియు నంత నొక్క
తఱిఁ దదీయోగ్రశాపచోదనవశమునఁ
గామునకుఁ జిక్కి తన యిష్టకాంతయైన
మాద్రితోఁ గూడి తోడనే మడిసె నధిప! 29

ఆ. వె. అట్లు లగుట వేఁట యనునది మేదినీ
కాంతులకుఁ బ్రమాదకరము దీని
వలన మఱియుఁ బెక్కువసుమతీ వల్లభుల్
విగత జీవులైరి మృగము లట్లు. 30

వ. కావున ఘోరకంఠనాదయు నామిషమాత్రాగ్రయు రూక్ష
రూపయు ధూమ్రోర్ధ్వమూర్ధజయుఁ గుంతదంతకరాళయు

నై రక్కసియుం బోలె వెక్కసంబుఁ గొల్పు మృగయ
యెవ్విధంబున మేలుఁగూర్పంజాలుఁ? గావున నీ వింక విఫలా
యాసంబగు మృగయాగసంబు విడువుము. దీనియందు వన్య
మృగంబునకును వధకునకును వాజివాహనంబునకును బ్రాణ
సంశయంబు సమానంబయ్యె యుండు. 31

క. ఓకల్యాణగుణోచిత !
నా కల నీపూర్వకులజ నరనాథప్రీ
త్యాకలనంబునఁ బ్రియుఁడవు
గాకుండిన నింత సెప్పఁగా నేమిటికిన్? 32

వ. నీ కిప్పు డింకఁ గామాంశజుం డగుపుత్త్రకుండు నుద్భవింపం
గలవాఁ డది యెట్లనినం జెప్పెద నాకర్ణింపుము. 33

సీ. మును రతిదేవి శంభుని సంస్తవ మొనర్చి
యర్చించెఁ దనదు నెయ్యంపుఁ బతికిఁ
బున రంగ సంభవంబుగ; నంత నామె సం
స్తుతుల కత్యంతసంతుష్టుఁ డగుచు
శంకరుం డామెతో సంగ్రహంబుగ నిట్లు
చెప్పె మంతనమునఁ; జెలువ ! వినుము
ఈ శైలతనుజాత యిల నిజాంశంబుచే
నవతరించి తనూభవార్థిని యయి

ఆ. వె. యధికభక్తి నన్ను నారాధనము చేసి
కుసుమశరునిఁ దనకుఁ గొడుకుఁ గాఁగఁ

బడయు నంత నతని కోడలు వెండియు నప్పు
డోదవుఁ జింత యుడిగి యుండుము మీఁవు. 34

క. అని రతితోఁ శంకరుఁ డి
త్యనుగ్రహము మీకుఁ జెప్పె నటుగావున నో
జననాయక ! యగ్గిరివర
తనుజాత ధరిత్రిఁ బుత్త్రతత్పరమతితోన్. 35

క. చండమహాసేన ధరా
మండలనాథునకు వరకుమారీమణి యై
యిందుకొను వేడ్కఁ బొడమి య
ఖండైశ్వర్యు నిను భర్తఁగాఁ బడసె నృపా. 36

వ. ఆమెయే యువ్వాసవదత్తాదేవియై యుండుటం జేసి యీమె
యింక శంకరు నారాధించి కామాంశం బగు పుత్త్రుం బడ
యం గల; దతండు సమస్త విద్యాధరులకుం జక్రవర్తి యై
యుండం గలవాఁ డని తెలుపుటయు నంత నవ్వత్సరుఁడు స
ంతసించు నా నారదువచనంబుల కమం దానందకందళితహృ
దయారవిందుం డై. 37

క. దేవమునివల్లభా ! త్వ
ద్భావుక వచనామృతమునఁ బరవశ మయ్యెన్
భావము; గావునఁ గొను వృ
థ్వీవలయం బెల్ల నీ కిదే యర్పింతున్. 38

వ. అని పలుకుచుఁ దన సమస్త మహీమండలరాజ్యాధిపత్యంబు

నవ్విబుధమునీంద్రునకు బ్రహ్మార్పణంబుగా సమర్పించుటయు
నంత నవ్వారించి నందనుండు కించిదంచితహాసవదనుం డగుచు
రాజేంద్రా! భక్తి సమర్పితంబైన భవదీయపారితోషికం
బును బడసి తద్దయుం దనిసితిం గావున నింక నీరాజ్యంబు
నీవ చేకొనుమని ప్రత్యర్పించి యంతర్హితుండై చనియె. 39

ఉ. నారద మౌని యవ్విధమునం జన, వత్సమహీశ్వరుండు నిం
డారెడు నెమ్మిఁ బుత్త్రజననాస్థ మనంబున నుప్పతిల్లఁగా
నూరక ముచ్చటల్ గుడుచుచుండెడి వాసవదత్తఁ గూడి త
న్నారద వాక్యచింతనమునన్ గడపెన్ దివమెల్ల నల్లనన్. 40

—♦ పింగలికావృత్తాంతము. ♦—

వ. ఇట్లాదినంబుఁ గడపి యమ్మఱునాఁ డారాజేంద్రుండు నిజా
స్థానభాగంబున నిండుకొలువై యుండ నిర్ణ్యోదితుం డను
పేరం బరఁగు తదీయప్రతీహారప్రవరుం డరిగి నన్నిధానం
బున కేతెంచి "యోమహారాజా! మిమ్ములఁ జేదరాలైన
యొక్కపాఱుతి యిరువురుకొండిక నినుంగులం గొని దేవర
వారి దివ్యదర్శనంబు నాకాంక్షించుచు ద్వారదేశంబునం
గాచియున్నయది" యని విన్నవించుటయు నది విని యను
కంపాంతరంగుండైన యాతేఁడు తత్ప్రవేశంబున కనుజ్ఞ
యొసంగె నయ్యనంతరంబున. 41

సీ. భుక్తి లేమిఁ గృశించిపోయి ధూసరపాండు
వర్ణమైన శరీరవల్లితోడ

11

మానంబుచేఁ బోలె మలినతరాత్యంత
శిథిలాంబరంబుచే విధురిత యయి
దుస్సహ నిజదైన్యదుఃఖంబులో నాఁగఁ
దోఁచు బిడ్డల నొడి మోచికొనుచు
వచ్చి కృతోచితవందనయై నిల్చి
యవ్విప్రవనిత వినయమున నిట్లు

తే. విన్నవించె "మహాప్రభూ! విమల ధరణి
విబుధ కులజాత నగు పేద వెలఁది నేను
గాలవశమున నిట్టి దుర్గతిని గంటిఁ
గలిగి రీబిడ్డలును నాకుఁ గవల లగుచు. 42

క. కడుపునకుఁ దగిన కూడె
న్నఁడు నొదవమిఁ బాలు వడవు నాకడ నిపుడీ
బుడుతల కొకించు కేనియు
నొడయండా! యేమి సెప్ప నోపుదు నిచటన్. 43

క. కృపణానాథజనంబులఁ
గృపఁ జూచెదు మేటి కల్పవృక్షము పనియున్
విపుల యశా! శరణాగత
క పరిత్రాత వనియును జగంబున వినికిన్. 44

క. నిను నే శరణము వేఁడఁగఁ
జనుదెంచిన దాన నిటకుఁ జయ్యన నిపుడో

జెల్లెడు సామాన్య ధరా
వల్లభుఁ డొకఁ డుండువాఁడు వత్సలమతియై. 52

వ. ఇట్లుండఁ గొంతకాలంబున కారాజునకు. 53

తే. పొడమె నొకబిడ్డ దేవదత్తుఁ డనఁ బరఁగు
వాఁడు; వానికిఁ గ్రమత జవ్వనము వొడము
చుండఁ జూచి "వీనికి వివాహోచిత మగు
ప్రాయ మొప్పారెఁ బెండిలి సేయవలయు" 54

వ. అని తలంచి మతిమదగ్రేసరుండైన యాజయదత్తుండు తన
మనంబున నిట్లాలోచింపఁదొడంగె. 55

తే. రాచవారలసిరి పణ్యరమణివోలెఁ
జంచలాత్మ; దాని బలాత్కరించి కాని
యనుభవింపఁగరాదు; వైశ్యజనలక్ష్మి
వరకులాంగనవోలె సుస్థిరత నుండు. 56

క. అది యితరుల నెన్నఁడు నొ
ల్లదు; కావునఁ దద్వణిక్కుల సముద్భూతన్
సుదతి నొకదానిఁ గొనితె
చ్చెద నాకొమరునకుఁ బెండ్లి చేసెదుపొంకన్. 57

వ. దానం జేసి యీనాకుమారునకు బహుదాయాదదూషితం
బైన రాజ్యంబునం దెట్టి యాపదయుం బుట్టకుండు నని
నిశ్చయించుకొని, పాటలీపుత్త్రకంబునం గల వసుదత్తుం డను
విత్తవంతుండైన యొక్కవణిజునికూఁతుం దన తనయున

కిన్నరి యుడుగిఁ బంచుటయు వసుదత్తుండును దన ప్రియ
పుత్రికను శ్లాఘ్యంబైన సంబంధంబుసేయ, వాంఛించుచున్న
వాఁ డగుటంజేసి దూరదేశాంతరంబని వెనుదీయక తత్క్ష
ణంబ తన కన్నియ నన్నరేంద్రతనయున కొసంగి విభవోత్త
రంబుగా వివాహమహోత్సవంబుఁ గావించి యయ్యల్లునకుఁ
దనీయజనక వైభవంబునఁ దలి బహుమానంబు వొలంగునట్లు
గా ననేకోత్తమరత్నంబులుం గాన్కవెట్టి పంపె నంత. 58

తే. అధిగతాఢ్యవణిక్తనయానమేతుఁ
డగుచు నిజనందను డు భోగానుభూతి
సలరుచుండఁగ జయదత్తుఁ డతనిఁ జూచి
సంతసించుచు సుఖముండె; నంత దేవి! 59

క. ఒకతఱి వసుదత్తుం డు
త్సుకుఁడై సంబంధిజనులఁ జూడం జనుదెం
చి కడుం గూరిమిఁ దన పు
త్రిక నొకపరి చెండి తనదు దేశంబునకున్. 60

క. కొని పోఁగఁ దనదు ప్రియ్యం
కుని నల్లుని నడిగి, యొప్పుకొని వా రనుపం
. దనకూఁతు నాత్మ గేహం
బునకుం గొని చనియె ముద్దు ముచ్చట దీఱన్. 61

తే. అవ్విధంబున వసుదత్తుఁ డాత్మజాతఁ
గొని చనినవెన్క జయదత్త మనుజనాథుఁ

డకట! యాకస్మికంబుగా నవని విడిచి
స్వర్గమున కేఁగె దైవవశమునఁ జేసి. 62

వ. అంత సతని దాయాదవర్గం బెల్ల నిసర్గంబైన వైరంబునం జెలరేఁగి తదీయరాజ్యం బెల్ల నాక్రమించి యధిష్ఠించుటయు నానయయంబునఁ దద్గోత్రజ భయంబునంజేసి యుక్తకార్య వివేకవతియైన దేవదత్తుని జనయిత్రి తనకుమారు నర్ధరాత్రంబున నెవ్వరికిం గానరాకుండ నన్యదేశంబునకుం గొని పోయి యుం దారాజపుత్త్రుం గనుంగొని దుఃఖోద్విగ్న మనస్కయై యతనితో నిట్లనియె. 63

చ. అనుఁడుఁ దనూజ! దైవవిధి నాపద యిట్టిది గూరె; దీనికై వనరుచుఁ గూరుచుండుటది వ్యర్థము; పూర్వదిగీశ్వరుండు దేవ విభుఁడు చక్రవర్తి మనపాలిట నుండెఁ గదయ్య! నీవు నయ్యనఁ జని విన్నవించుకొను మాతని కాత్మవిపద్దశాస్థితిన్.

క. చలమునఁ దెగి నీదాయా
దులు నీ కొనరించినట్టి దుర్నయ మెల్లం
దెలిసిన నాతఁడు వారలఁ
దోలఁగం దోలించి కరుణతో నిను నిల్పున్. 65

క. తనయా! నీజనకుని యెడ
ననురాగము పెద్ద యతని; కక్కతమున నిన్
గని జాలిఁ జెంది రాజ్యం
బును సాధించి యిడు నీకుఁ బూర్వస్థితిగాన్. 66

చ. అని జనయిత్రి యిట్లు నయమారఁగఁ జెప్పిన దేవదత్తుఁ డి
ట్లనె; విను మమ్మ! నేఁ బరికరాదిక మేదియు లేక యివ్విధం
బున నెటు చక్రవర్తిఁ గనఁ బోవుదుఁ? బోవుదునేని యందు నన్
గనుఁగొని భక్తి నా కెవఁడు గౌరవముం బొనరించుఁ దల్లిరో!

తే. వేషభాషలు లేకుండ వెఱ్ఱివోలెఁ
జని యచటఁ జక్రివర్తి దర్శనము సేయఁ
దొడరునెడ నోయి నెడఁగ! యెవ్వఁడవు నీవు?
పాలు! పో! మ్మన్న నది యెుక్క చావుగాదె? 68

వ. అని యిట్లు దేవదత్తుండు వలికిన విని తల్లి మరల నతని
కిట్లనియె 69

సీ. ఔను సత్యంబ నాయన! వేషభాషలు
లేకున్నఁ, గనుఁగొను లోకు లెవరు
మన్నింప; రటుగాన, మహానీయవిత్తసం
కలితుండు నీమామగారు; గాదె?
యతని చెంతకుఁ దోల్త నరిగి కొంతధనంబు
వడసి పిమ్మట నీకు వలయునట్టి
పరికర మెల్ల సంపాదించికొని వేగ
చక్రవర్తిం జూడఁ జనఁగవలదె?

తే. అని యిటులు తల్లి ప్రేరేప నాలకించి
మామయింటికిఁ జనఁ దన మనమునందు

లజ్జ వహించుండియును రాజ్యలబ్ధిపొందెఁ
జనక తీఱ దలంచు నిశ్చయముఁ బూని. 70

వ. నిజమాతృదేవతకు నమస్కారం బొనర్చి తదీయశుభాశీర్వాదంబులం బడసి యనుజ్ఞం గైకొని బయలువెడలి బహుదిన ప్రయాణంబులం బరిశ్రాంతుండై క్రమంబుగ శ్వశురగృహంబున కరిగి, తా నచ్చటికి నరుగు నప్పటికి సాయంసమయం బగుటయుఁ, బితృవిహీనుండును నిష్కించనుండు నై యున్న తా నట్టియకాలంబునఁ గంటఁ దడివెట్టవలసి వచ్చునని సంశయించుచు లజ్జావశంబున లోనికిం బోనేరక యయ్యత్తవారి యింటిచెంగట నున్న యొక్క సత్త్రంబుముంగిటఁ గూరుచుండి పథపరిశ్రాంతిం జేసి నిద్దురరాక యుద్దియో చింతించికొనుచుండె; నంత నిశీధవేళ యగుటయు నాసమయంబున.

చ. మఱుఁగుగ మామగారి పెనుమాడువుపైఁగల మిద్దెనుండి న
త్వరముగఁ ద్రాటివెంట డిగుదాని, సముజ్జ్వలరత్నభూషణాం
బర పరిభూషితాంగ యయి భాసిలుదాని, ననల్పసాహసా
కర మగుదాని నొక్కకనకప్రతిమాప్రతిమానసుందరిన్. 72

క. అతి విస్మితుఁడై కని త
ద్వితత విభూషణసురత్నవితతిరుచిద్యో
తిత నంబరమార్గాధః
పతితోల్కం బోని యాచపలవామాక్షిన్. 73

వ. తన భార్యగా నెఱింగి మునులు గాఁడిపంపఁ జొచ్చె; నంత
నక్కాంతయు నవ్విధంబున జేసి వచ్చి సత్త్రాంగణంబున నున్న
యాదేవదత్తుం గనుంగొనియుఁ బోలికయుం ధూసరితశ్యామ
దేహుండై యుండుటం జేసి యాతఁడు నాథుఁ డని తెలి
యనేరక యుచ్చైఃకటితమున నీ వెవ్వండ వని యుగ్రత మెదు
గుటయు నంత నాదేవదత్తుఁ డది విని నేనొక్క పాంథుండ
నని యల్లనఁ బ్రత్యుత్తరం బిచ్చి యూరకుండె; నయ్యనంత
రంబున. 74

చ. చరచర నవ్వాలంతుకయుఁ జాటుగ నొప్పుడు సత్త్రశాలికన్
శౌరఁబడి పోని కేఁగుటయుఁ, గూడఁగ దాసిఁగా కిటు దీనివృత్తమె
త్తెఱఁగున నున్నదో యని మదిం దలపోయుచు దేవదత్తుఁడున్
మెలఁగుచుఁ గదానివెంటఁ జనిమందిరమునఁ దాఁగియుండెఁ దాన్

గీ. అంత నయ్యింతి సత్త్రగేహాంతరమునఁ
దన నిమిత్తంబు మిత్రులఁ దత్తఱము సెంచు
చున్న యొకమోటు మానిసియొద్ద కేఁగి
నిల్చె; వాఁడును గడు నల్కనిగుడఁ జూచి. 76

క. వెడవింటివాఁ డొనర్చెడు
గడబిడలకు నేఁ గలంగి గజిబిజియై యి
క్కడ నిల్తుండఁగ నీ విటు
లెడయఁగ నేలే? యటంచుఁ దన్నుఁ దొడంగెన్. 77

వ. అంత. 78

మ. శపనాథుఁ డేటు తన్ను మున్న నిజనాగోద్రేక మత్యంతమున్
విఫలంబై విలసిల్లుచుండ దురితవ్రీడాభయోద్వేగ శో
న్య పరితాప్యజ్యవినష్టశీల యది యమ్మా! చెప్పనోరాద; దా
కృపణుం దేర్చుచు వేఁడుకొంచు ననుఁగ్రొన్ వానితో నయ్యెడన్.

వ. స్వేచ్ఛానుసారంబుగఁ బ్రవర్తింపఁ దొడంగె; నంత నది
యాతనియుం గనుంగొని బహుప్రజ్ఞావంతుండైన యారాజ
పుత్త్రుండు తన మనంబున నిట్లు చింతింపం దొడంగె. 80

క. ఈధూర్తకృతికి నే మదిఁ
గ్రోధోద్రేకంబు నిందఁ బూడిన మఱి నే
సాధింపఁ దగిన దిక నేక
సాధుతరంబైన కార్యసాధనము గదే? 81

చ. కరమున నున్న యీరిపునికాయవిఖండనదక్షమైన మ
త్తరతరఖడ్గ మీకృపణకామినియందును గామియైన యీ
నరపశుమాత్రునందుఁ బ్రవణంబుగ నెట్లొనరింతు? నిమ్మహా
దురితమతుల్ తమంతన యధోగతిపాలయి తెళ్ళకుందురే?

తే. ఏమి లాభంబు గలదు నాకింక నిట్టి
యసతితో? నక్కటా! దైవ మతికఠినత
మన్మనోధైర్య మరయ నిమ్మాడ్కి దుఃఖ
ములను గురియుచుఁ జేయు లీల లివియెల్ల! 82

ఆ. వె. కులముగాని కులము కోమలిఁ గొనితెచ్చి
కొన్న దోష మిద్ది; యెన్న దీని

తప్పు గాదు; కాకి తన కాకిఁబును పికి
కోకిలమ్ము నేల గూర్మి సేయు? 84

తే. అని తలంచి యుపేక్షించె నాతఁ డద్దు
రాత్మురాలి; జిగీషాపరాయణు లగు
నుత్తమోత్తమపురుషుల చిత్తమారుఁ
బాలఁదొలుక లనంగఁబడుగడ్డిపోఁచ లెందు? 85

వ. ఓదేవీ! యది యట్లుండె; నాసమయంబున. 86

మ. పరివృద్ధంబగుకూర్మి నచ్చెడిప యప్పాపాత్మునింగూడు వా
సురతావేగవశంబునం గదలి తచ్ఛ్రీత్ర్యుజ్జ్వల నొక్కకా
భరణం బొక్కఁడు జాఱియూడిపడె; నప్పాటుమ్మహానంద సౌ
ఖ్యరసావేశ మనస్కఁ యప్పుడది దాఁ గానంగలే కవ్వలన్.

క. సురతాంతంబున నుపపతిఁ
బరిరంభణ మాచరించి ప్రియావశతఁ ద
న్నరసు విడనాడ నేరక
పరితాపముఁ గొంచుఁ దుదకు బహుకష్టమునన్. 88

ఆ. వె. వానితోడఁ బోయివచ్చెద నని చెప్పి
తిరిగి తిరిగి కనుచు మరల నరిగి
వచ్చినట్లు తన నివాసనౌధం బెక్కి
చనియె వేగ నన్నన్న గాఁగ. 89

వ. అంతఁ దత్ప్రచ్ఛన్నకాముకుండును సత్వరుండై యొండెనిం
బోవుటయు నప్పు డారాజపుత్త్రిం డప్పాత్మకర్ణకరత్నాభర

ణంబుం గనుంగొని, బ్రహ్మదేవుండు తనమోదం గరుణించి పరిణష్టరాజ్యశ్రీ గవేషణంబున మోహాంధకారంబు వారింప ననుగ్రహించిన విస్ఫురదగ్నిశిఖాజాలంబైన కరదీపికయుం బోలెం దన కది యట్లు సంప్రాప్తం బగుటయు దానిం గైకొని యది యమూల్యంబైన తొడవగుట యెఱింగి సిద్ధకార్యుండై తత్క్షణంబ యచటినుండి బయలు వెడలి కన్యాకుబ్జంబున కరిగి యందా నగ నొక్క మహాధనవంతుచేతం గొనుప వెట్టి యొకలక్షసువర్ణంబులం గైకొని యుప్వత్తంబు వెచ్చించి.

క. కరి తురగ భూషణాంబర
పరికర మంతయును బొందుపడ నిలిచి లస
త్పరివార సహితుఁడై న
త్వరముగఁ జనెఁ జక్రవర్తి వర్ధనమునకున్. 91

క. చని, యతని యనుగ్రహావశ
మునఁ బడసిన బహుళసైన్యములతో నురలన్
దనదేశమున కరిగి చ
య్యన నని నిజశత్రుసముదయముఁ ద్రుంచి వెసన్. 92

తే. పైతృకంబైన తద్రాజ్యపదముఁ బడసి
ధన్యుఁడై మాతృదేవత తద్ద యలర
దేవదత్తుండు నిజకోశదేశగుప్త
విత్తముం బంపి బంధంబు వీడిపించి. 93

ఆ. వె. అమ్మహార్ఘ్యమణి మయాఢ్యభూషణముఁ దా
నంత మామగారిచెంత కనిచె
నతని పుత్త్రి సత్త్రమందుఁ గావించిన
తప్రహాస్య మది యతనికిఁ దెలియు. 94

క. పదపడి వసుదత్తుఁడు న
య్యుద్ది నిజసుతకిన్న భూష యప్పుడు గని న
మ్మది సంభ్రమ మొందేసియుఁ
గమరఁగఁ బుత్త్రికకు దానిఁ గాన్పించుటయున్. 95

వ. ఆ యుద్యనితయు స్వకీయచారిత్రంబు చందంబునఁ బూర్వపరి
భ్రష్టంబైన యారత్నమాలాకారంబుం గనుంగొని దానిం
దన భర్త పనుచుటయు నెఱింగి నిజహృదయంబున నెంతే
యుం గలంగుచు. 96

సీ. ఆనాఁటి రాత్రి నే నానత్త్రగేహంబు
చెంతఁ గాంచితి నొక్కపింత పథకు
నలఁచు నిక్కముగ నాపతియు కావలయు మ
చ్చిహ్నలంబుఁ దెలియ నెంచి యారువచ్చి
యుండెఁగాఁబోలు!; నెవ్వండొ యంచుఁ దలంచి
తెలియ లేనైతి నత్తిమిరముందు
నిక్కన్న భూష యయ్యెడజారి పడఁబోలు!
నక్కటా! పతిచేతఁ జిక్కెఁబోలు!

తే. అనుచు గతవృత్త మంతయు నాకళించి
యాత్మదుర్నయ మెల్ల సువ్యక్త మగుట
నడలు నవ్వైశ్యసుత హృదయంబు చెదరి
పగిలిపోయె మహారాజపత్ని ! వింటె. 97

వ. పదంపడి తజ్జనకుం డైన వసుదత్తుండు నిజపుత్రికారహస్యం బులనెల్ల నెఱింగిన తదీయచేటిక నొకరుక నుపాయపూర్వ కంబుగా నడిగి తత్త్వం బంతయుం దెలిసికొని తచ్ఛోకం బుడిగి యుండె; నంత నారాజపుత్రుండు దేవదత్తుండును సంప్రాప్తరాజ్యలక్ష్మీకుండై స్వకీయసద్గుణానీకంబునం బ్రకృ వర్గిని మెప్పించి యపరలక్ష్మియుం బోని యతనికుమారీ రత్నంబుం దనకుం బత్నీతిలకంబుగా నార్జించి పడసి యభీష్ట సుఖంబు లనుభవించుచుండె. 98

తే. ఇవ్విధంబున నోదేవి ! పుష్పంబోండ్ల
హృదయములు సాహసము సేయునెడల వజ్ర
కర్కశములగు నవియె యొక్కతఱి నధిక
సాధ్వసము గూరం గుసుమపేశలతం గాంచు. 99

క. తద్వనితల నొకకొందఱు
సద్వంశజలై సువృత్త సదమలతా సం
పద్వివృతిం దొడవు లగుచు జ
గద్వనుతిం గాంత్రు మౌక్తికమణుల భంగిన్. 100

వ. ఇదియునుంగాక. 101

తే. హారిణివలె రాజ్యలక్ష్మి తా ననవరతము
దాటుఁగొని పాఱఁజూచు; నద్దాని బుధులు
ధైర్య దృఢతరపాశబంధములఁ గట్టి
పట్ట నేర్చిద రిట్టు లోపట్టమహిషి ! 102

తే. కాన, నాపదలం దైనఁగాని ధైర్య
గరిమ విడరాదు సిరిఁగోరు ఘనమతులకు
దాని కీయెడ నేలెత్క థయు మదీయ
చరితమును సైత మిట నిదర్శనము లగును. 103

ఉ. గొప్పగఁ జెప్పుచుంటి ననుకోకుము తల్లిరో! భర్తఁ బాసి నే
నిప్పగిదిన్ మహాపదల నెన్నిటిఁ గాంచిన శీలమెన్నఁడున్
దప్పి చరింపఁ గావునన తత్ఫల మీభవదీయ దర్శనం
బిప్పుడు నాకు సర్వశుభ హేతుక మై లభియించె నీగతిన్.

క. అని తద్విప్రసతీముఖ
మున నిక్కథ నట్లు సాంతముగ విని యపు డా
జననాథపత్ని తన మన
మున నిట్లు తలంపఁజొచ్చె ముదితాత్మిక యై. 105

క. ఈ విప్రాంగన నిక్కము
గా విమల గుణాభిజాత్యకలితయు యీవా
క్పావీణ్యము శీలప్ర
స్తావము నీయుమ యుదారతన్ బ్రకటించున్. 106

వ. ఈమె యిట్టి యౌదార్యవతి యగుటం జేసియు రాజసభా
ప్రవేశంబునం బ్రావీణ్యంబును దదీయానురంజనంబున సామ
ర్థ్యంబును గాంచఁగల్గె నని యిట్లు తలంచి యౌవాసవదత్తా
దేవి మరల నాబ్రాహ్మణిం గనుంగొని. 107

ఆ.వె. ఎవనిధర్మపత్ని వీవు? నీ వృత్తాంత
మేమి? యెచటినుండి యిటకు వచ్చి
తెలుఁగ మాకుఁ దెల్పుదే యన విని వెండి
బ్రాహ్మణియును నిట్లు పలుకఁ దొడఁగె. 108

క. దేవీ! విను మాళవమున
శ్రీ వాణీ నిలయమునఁ బ్రసిద్ధుండై భూ
దేవవరుఁ డగ్నిదత్తుఁడు
నా వెలయుచు నుండె నొక్క- నయనిధి కృతియై. 109

క. వర్ధిత సంపదుఁ డాతం
డర్థి జనంబులకు సముచితార్థప్రదుఁడై
యర్థార్జనము సదా చరి
తార్థము గావించికొనుచు నల్లుండఁగన్. 110

సీ. క్రమముగా నతనికిఁ గలిగి రిద్దఱు కుమా
రులు సముచిత గుణ రూప సహితు
లందు శంకరదత్తుఁ డనఁగ జ్యేష్ఠుం డొప్పు
శాంతికరుండు నాఁ జనుఁ గనిష్ఠుఁ

శాళాంతికరుఁడు బాల్యంబందె విద్యార్థి
యై తన జనకు గేహంబు వెడలి
చనియె నెచ్చటికో యశస్విని! యొండ
పత్ని! యాలింపు తద్భ్రాతృ నన్ను
గీ. వివిధ యజ్ఞార్థ సంభృత విత్తభార
ధన్యుఁడగు యజ్ఞదత్తాభిధాను పుత్త్రుఁ
బరిణయం బయ్యె సత్కుల ప్రభవ ననుచుఁ
గడఁగి ; పదపడి మఱికొంత కాలమునకు. 111

వ. మదీయభర్తృజనకుండగు యజ్ఞదత్తుండును వృద్ధుండై నిజపత్నియుం దన్ననుగమింప లోకాంతరంబున కరిగె ; నంతనాభర్త గర్భవతినైయున్న నన్నింట దిగవిడిచి తన జననీజనకులకుఁ బుణ్యలోకావాప్తిగాఁ దీర్ఘయాత్ర లొనరింపం జని. 112

క. మనమున రవిలేదు జననీ
జనక వియోగవ్యథాగ్ని సంతాపమునన్
మన నేరక పరమ విర
క్తని మెయి విడె నట సరస్వతీపూరమునన్. 113

ఆ. వె. అంత నతనివెంట నరిగిన సహాయాయి
వర్గ మరుగుదెంచి వజ్రపాత
సదృశమైన యీ విషాదవృత్తాంతంబుఁ
దెలియఁజేసి రకట! దేవి! యపుడు. 114

తే. అగ్నిదేవునిఁ జొచ్చి నే ననుగమింపఁ
గడఁగితిని గాని, బంధువర్గంబు నన్ను
గర్భవతినౌట నిర్బంధకమ్ము చేసి
యుడిపి; రాభాగ్యమేని నా కొదవకుండ. 115

వ. పదంపడి నా తాపతివియోగదుఃఖానలంబు చల్లారకుండఁగనె మఱ్ఱివారం బైన యొక్క దస్యుసమూహంబుచే నస్మదీయ నివాసం బగు నగ్రహారంబు కొల్లఁగొట్టంబడుటయు నే నట్టి దండడియందు శీలభంగభయంబునం జేసి తత్ర ణాంబ మఱి ముప్వురు బ్రాహ్మణస్త్రీలతోఁ గూడఁ గొంచెపాటి వస్త్రంబులమాత్రము గైకొని సత్వరంబుగాఁ బలాయనం బొనర్చి.

ఆ.వె. తిరిగితిరిగి యాత్మదేశభంగంబున
పల్లమందు మిప్పులఁ దల్లడిలుచు
దూగ మరిగి వారితో నట నొకనెలఁ
గడుపుకొంటిఁ గాయకష్ట మూని. 117

వ. అయ్యనంతరంబున :— 118

క. ధరణి జను లెల్ల వత్సే
శ్వరుఁడు నిరాధారదీనజనవితతికి స
చ్ఛరణం బని తెలుపఁగ విని
యరుదెంచితిఁ దత్సతీత్రయ సహిత నగుచున్. 119

ఆ.వె. దారినడుమ మాకు ధైర్యంబు శీలంబు
దక్క బత్తె మెదియుఁ బారసింప

దయ్యె; నెట్టు లెటులో తినువునఁ బ్రాణమ్ము
లుండ నిటకు వచ్చియుంటి మేము. 120

తే. వచ్చినంతన తద్విప్రవనిత లుచిత
సఖులుగా నుండి పరిచర్య సలుపుచుండఁ
గంటి నీపుత్త్రికల నేకకాలమంద
కర్మవశమున నిట నిట్లు కవలు గాఁగ. 121

క. పతిశోకము, పరదేశ
స్థితి, దారిద్ర్యాతిశయము, ద్విగుణం బగు సం
తతి యాహా! విధి నాకీ
గతి నాపద్గణకవాటకము తెఱచెఁగదా! 122

చ. మడిసిన భర్తృవంశ మొకమాత్రముగా నిలఁబెట్ట నాకు ని
క్కొడుకుల దైవ మిచ్చె నను కొందునుగాక యనాథులైనయీ
బడుగులఁ బెంపఁగాఁ దగు నుపాయ మొకండును దోఁప
దయ్యె; నెవ్వడువునఁ జూడ వత్సమహీవల్లభుఁ డొక్కఁడ
దిక్కు నాకిఁకన్. 123

వ. అని యిట్లనేకవిధంబులం జింతించి, కట్టకడకు స్త్రీజనవిభూ
షణం బైన లజ్జం బరిత్యజించి రాజసభామధ్యంబునం బడి
యమ్మహారాజు మ్రోల మొఱవెట్టుకొన్నదాన; నా సమ
యంబున. 124

క. అతఁడు కరుణించె నను; దు
స్థిత బాలాపత్యదుఃఖశీలం గని నే

మతిమంతుఁ డోర్చు? నా నర
పతి, యందును బహుదయార్ద్రభావుండుగదే! 125

వ. పదంపడి యమ్మహీకాంతు నాదేశంబున భవదీయచరణాంతి
కంబుఁ జేరుకొంటి; నిప్పటికి నాయాపద లెల్ల ద్వారపరి
హృతంబు లైన చందంబున వెనుకఁ బాఱంద్రోడుఁగె; నోతల్లీ!
యిదియ మదీయవృత్తాంతంబు. నాపేరు పింగళిక యనం
బడుచుండు. 126

ఆ.వె. పసితనంబునుండి భర్తతో నిత్యాగ్ని
హోత్రకృతుల మెలఁగ హోమధూమ
పటలి నాదు కనులు పచ్చఁబాఱుట నాకుఁ
బింగళిక యటన్న పేరు గలిగె. 127

క. పరదేశంబుల పాలై
యరిగిన నామఱఁది యోమహారాజ్ఞీ! యి
ద్ధర నా శాంతికరుం డే
పరిసరములఁ జనెనో తెలియఁబడ దిప్పటికిన్. 128

వ. అని యిట్లాబ్రాహ్మణి స్వకీయవృత్తాంతంబంతయు విన్న
వించిన విని యామె కులీనయ యని యెఱింగి యవ్వాసవ
దత్తాదేవి యొకింతవడి తనహృదయంబునఁ దర్కించుకొని
ప్రియపూర్వకంబుగా నప్పింగళిక కిట్లనియె. 129

ఆ.వె. కలఁడు మాకు శాంతికరుఁ డనంబడు పురో
హితుఁడు; నీమఱంది యేమొ యాతఁ

అన్యదేశవాసియుఁట తొల్లి; నే వింటిఁ,
బిదప నాతఁ డిందు పేరుసెంది. 130

క. రాజపురోధసుఁడై యీ
యోజ న్విలసిల్లుచుండె నోపుఁగదా? తే
పీ జాడఁ దెలిసికొందము
నా జాతోత్సుకత నామె నాఁ డటఁ గడపెన్. 131

వ. అంత నమ్మఱునాటి దినంబు ప్రాతఃకాలంబున వాసవదత్తా దేవియు నిజపురోహితుం డైన శాంతికరు రప్పించి తదీయాన్వయక్రమం బడిగి తెలిసికొని సంజాతనిశ్చయయై యప్పింగళిక నాతనికిఁ జూపించి యయ్యా! యీయమ్మ మీ యన్నగారిపత్ని యని చెప్పుటయు నతం డత్యంతాశ్చర్యనిమగ్నుండై యాపింగళికం బోల్చి తెలిసికొని విజ్ఞాత నిజబంధుకుటుంబవృత్తాంతుం డై యామెం దనవెంట స్వకీయగేహంబునకుఁ గొనిపోయి పరలోకగతు లైన తల్లిదండ్రులను సోదరునిం దలంచి యథోచితంబుగా ననుశోకించి బాలకన్నా నూతనాగతయై యున్న యా వదినెగారి నూరడించి యాదరించుచుండె నయ్యనంతరంబున. 132

ఆ. వె. వత్సరాజపత్ని వాసవదత్తయుఁ
గరుణఁ దత్కుమారకద్వయంబుఁ
దనకుఁ బొడము నున్న తనుజన్మునకుఁ బురో
హితయుగంబుగాఁగ నేర్పరించి. 133

వ. వా రిర్వురయందును బెద్దవానికి శాంతిసోముం డనియును రెండవవానికి వైశ్వానరుం డనియును దనయంతటఁ దాన నామకరణంబులు గావించి వారి కనేక సంపద లొసంగి యనుగ్రహించె. 134

చ. కడుకొని లోకుల న్నిజ సుకర్మములే ఫలభూమిఁ జేర్చు ము
న్నడిచని, కన్నుఁగానని జనంబుల నల్లనఁ గొంచుఁబోయి చే
ర్చెదు గతి; నాత్మపౌరుషవిశేషము లూఱక హేతుమాత్ర
తన్। దోడరుచు నుండు; నియ్యది కనుంగొనఁ నేర రనేకు
లిద్ధరన్. 135

వ. అది యట్లుకావునఁ బింగళికయు నామె నిసుఁగులును దమ పూర్వపుణ్యకర్మవశంబున సయ్యెడకిఁ గొనితేఁబడి యందు శాంతికరునితోడంగూడ వా రెల్లరుం గలిసికొని సుఖంబుండఁ గలిగి; రట్టు లాపింగళిక యచ్చటఁ దన కుమారుల నిర్వురను సమస్తసుఖోపచారంబులం బోషించికొనుచు దేవర గృహంబున వసించుచుండి ప్రతిదివసంబును రాజ్ఞీసన్నిధానంబునకు రాకపోకలు గావించుచుఁ గ్రమంబుగఁ దదీయానుగ్రహాతిశయంబునకు భాజనంబై యట్లుండఁ గొన్ని దినంబులు గడచనుటయు నంత నొకానొకనాఁడు. 136

సీ. తనవెంట నింత లంతలు నైన నెయ్యంపుఁ
గొమరుల నేవురఁ గొంచు, వాడ

మట్టి మూఁకుడు లమ్మ నట్టిట్టుఁ దిరుగాడు
కుమ్మరి చెలువ యొక్కతె నిజావ
సథము చెంగటికిని జనుదేరఁ గని, వత్స
మనుజనాయకు కూర్మి మహిషి యంతఁ
గెలఁకున నున్న పింగళికకుఁ జూపి యి
ట్లనెఁ 'గంటె? పింగళికా! కులాల

తే. తరుణి; దీనికి బిడ్డ లేవురు జనించి
రార! నాకింతకాలాన కైన నొక్క
పుత్త్రకుండును గలుగకపోయె నకట!
కనుఁగొనుము నాదు పుణ్యభాగ్యముల తెఱఁగు! 137

క. ఇట్టి కులాలాంగనయుం
బట్టయ్యెఁ గదమ్మ యిట్టి భాగ్యంబులు; కే
నిట్టి నృపమహిషి నయ్యును
గట్టా! యీపాటిదైనఁ గానైతిఁగదా! 138

వ. అనిన విని పింగళిక యామె కిట్లనియె. 139

క. అమ్మా! యీదృక్సంతా
నమ్మది విను పాపకర్మ నద్ధము తొలి జ
న్మమ్మున; నటుగావుననే
యిమ్మెయి నిటువంటి విత్తహీనుల యిండ్లన్. 140

తే. బహుతరం బయి పొడమి దౌర్భాగ్యదశకుఁ
దావలం బగుచుండుఁ గాంతామతల్లి!

తలఁప మీవంటివారికిఁ గలుగుచుండు
ధన్యుఁ డెవ్వఁడో యుత్తమోత్తముఁ డొకండు. 141
క. కావునఁ దొరపడఁ బోకుము
దేవీ! నీకును గుమారతిలకోదయ ల
క్ష్మీవిభవము చేకూరం
బోవుచు నున్నయది వేగనుగనే యింకన్. 142
తే. అనుచు నప్పింగళిక యుచితాభిభాష
ణమ్ము లెన్ని నచించుచున్నను గుమార
జన్మలాభోత్సుకత్వంబు సముధికముగఁ
దనర వాసవదత్త చింతఁ గొనఁజొచ్చె. 143
వ. ఇట్లప్పు డచ్చట వాసవదత్తాదేవి పుత్రజన్మోత్సుకత్వం
బునఁ జింతిల్లుచుఁ జిన్నవోయి యుండుటయు నాసమయం
బున వత్సేశ్వరుండు వినోదార్థంబుగా నద్దేవియున్నకడ కరు
గుదెంచి యామెం గనుంగొని తదీయ హృదయాభిప్రాయం
బుఁ దెలిసికొని యామెతో నిట్లనియె. 144
ఉ. నారద మౌనిశేఖరుఁడు నర్మిలి మీఱ వచించె నో సితాం
భోరుహపత్త్రినేత్రి! శివపూజనముం బొనరించి తత్కృపా
పూరముచేత నీవొక సుపుత్త్రకుఁ గాంచెద వంచుఁ;గాన నా
తీరున నీశ్వరార్చనవిధిం బొనరింపఁగఁబూను మీ వికన్.
క. సుర మౌని వచనములు సు
స్థిరములు; కావునఁ గలంగి చింతింపకు; మ

వ్వరదాయకుండు గిరిజా
పరుఁ డారాధ్యుండు మన కవశ్యము దేవీ! 146

వ. అనిన నది విని వాసవదత్తాదేవియు వల్లభవచనానుసారం
బుగా వామదేవారాధన వ్రతనిశ్చయంబుఁ గావించె; నంత
సర్వేశ్వరుండు తానును నిజమంత్రి నివహంబుతోడను
నిఖిలరాష్ట్ర ప్రజాసమూహంబుతోడను నిటలలోచనార్చన
నియమంబు వహించి నిశ్చలచిత్తుండై యుండె; నట్టు లారాజ
దంపతులు త్రిలోచనారాధనపరాయణత్వంబునఁ ద్రిరాత్రోప
వాసదీక్షం బూని రెండుదినంబులు గడపుటయు నంత
నమ్మూఁడవనాఁటిరేయి సదాశివుండు సదయాంతఃకరణుండై
స్వప్నంబున సాక్షాత్కరించి వారి కిట్లనియె. 147

తే. అనఘ! లోకరాజదంపతులార! రెండు!
సుతనుజుఁడు మీకుఁ గామాంశజుండు పొడము
నస్మదీయ మహానుగ్రహాప్తి సార్వ
భౌమ్య విద్యాధరేశత నలరువాఁడు. 148

క. అని చంద్రశేఖరుం డిటు
లనుకంప దలిర్పఁ బలికి యంతర్హితుఁడై
చన మేల్కని యాదంపతు
లనుపమ సంతోషభరితులై తమ కింకన్. 149

తే. అభిమతార్థంబు సిద్ధించె నను మ్ము ధన్య
తను గడించితి మయ్యుమాధవుని కరుణ

ననుచు లేచి ప్రభాతంబునందు నిఖిల
మంత్రిమండలియును బ్రజామండలమును. 150

వ. నిజ స్వప్నవృత్తాంత సుధారస పరితృప్తుండై మహోత్సవంబు
గావింప నారాజదంపతులును సమస్తాప్త బంధుమంత్రిభృత్య
సమేతులై సముచితోత్సవ పూర్వకంబుగా వ్రతపారణంబు
గావించి సుఖంబుండి రంతఁ గతిపయ దివసంబులు గడచిన
టయి నయ్యనంతరంబున నొకనాఁటిరేయి. 151

క. పరివర్ధిత భూరిజటా
ధరుఁడగు పురుషుం డొకండు తద్దయుఁ గరుణన్
బరిపక్వమైన ఫల మొకఁ
డరుణముగఁ గొని వచ్చి యాత్మహస్తముతోడన్. 152

ఆ. వె. భక్తి బద్ధపాణిపల్లవయై యున్న
యన్నృపాల మహిషి నల్లఁ జేరి
యామె హస్తపుటమునం దుంచి చనియెఁ ద
త్స్వప్నమందు మిగుల నంతసముగ. 153

వ. అంత. 154

ఉ. అక్కలతీరు మోదమలరారఁగ వాసవదత్త తెల్పఁగా
నక్కొను వేడ్క వత్సధరణీపతి మంత్రులతోడఁ జెప్పి, త
ద్వాక్కుల నమ్మహాసచివవర్యులు మెచ్చి నుతింప నింపుపెం
పెక్కఁ గుమారు నిచ్చెఁ బరమేశుఁడె తత్ఫల కైతవంబునన్.

క. అని తలఁచుచు నిజమహిషీ
వినిబద్ధ మహానురాగవృత్తిఁ దదీయా
నన సరసిజ మధురస సే
వన రతి నతఁ డచట నెలమి వర్తిలుచుండెన్. 156

(శ్రీ) (శ్రీ) (శ్రీ)

నరవాహనజనన లంబకమునఁ
బ్రథమ తరంగము
సమాప్తము.



ఓమ్!

# ఆంధ్ర కథాసరిత్సాగరము.

## నరవాహనదత్తజననలంబకము.

:o:

### ద్వితీయ తరంగము

వ. అయ్యనంతరంబున:— 1

తే. వత్సనరనాథ హృదయోత్సవంబు గాఁగ
శంకరానుగ్రహంబున సత్వరంబ
తాల్చె గర్భంబు వాసవదత్త పుష్ప
సాయకాంశావతరణ ముజ్జ్వలతరంబు. 2

వ. ఆసమయంబున:— 3

చ. కడుకొని తెల్లఁబాఱిన మొగం బది చుట్టటికంబుకల్మిమైఁ
గడుపున నొప్పుచున్న సుమకార్ముకుపైఁ గలకూర్మిపేర్మి చొ
ప్పడ దరి కేఁగుదెంచిన తుషాకరబింబము నాఁ దనర్ప న
ప్పడఁతుక గర్భలక్షణవిభాసితయై విలసిల్లె నయ్యెడన్. 4

తే. అలసి కూర్చుండ రత్నపర్యంకమునకు
నుభయపార్శ్వంబులందుఁ జెన్నొందు నామె

ప్రీతిమ లాత్మేశుపైఁ గల ప్రణయగరిమ
నచట నున్నరతిప్రీతు లనఁగఁ దోఁచె. 5

వ. అంత:— 6

తే. భావి విద్యాధరమహాధిపతికి గర్భ
సేవ యొనరింప మూర్తివిశిష్ట లగుచు
వెలసి యిష్టదలై యున్న విద్య లనఁగ
నెచ్చెలులు గొల్వఁ దొడఁగి రా నృపతిసతిని. 7

తే. నవ విసీల పరివాళ కాంత ముఖ విస్ఫు
ర, త్పయోధర యుగము గర్భస్థ సుతున
కలిమి నభిషేక మొనరింప నెత్తుకొన్న
పైఁడి కడవ లనంగ నప్పడఁతి దాల్చె. 8

వ. ఇవ్విధంబున నప్పుడ వాసవదత్తాదేవి యత్యంతమనోహర
గర్భలక్షణలక్షితయై, తద్గర్భంబున నుద్భవింపంబోవు నర్భక
రత్నం బప్రియత్నంబుగాఁ ద మ్మాక్రమింపఁగలం డను
భయంబునఁ గలంగెడు జలంబులం బోలుచుచు నచ్చోటి
కరుదెంచి యామె సన్నిధులఁ జిన్నవోయి సేవించుచున్న
రత్ననిధులగు తోయధుల వపువునం బోలుచు స్వచ్ఛస్ఫు
రిత సచ్ఛాయ విశాల మణికుట్టిమంబుల సుఖశయనగతయై,
తద్విమానమధ్యస్థ మాణిక్యఫలకంబునం బ్రతిఫలించిన నిజ
ప్రతిబింబం బుదరసంస్థితుండై యున్న తమ యధిపునకుఁ బ్రణ
మిల్ల నభోమార్గంబునం జనుదెంచిన విద్యాధరలక్ష్మియుం

భోలె విలసిల్లుచుండఁ, దా ననవరతంబును మంత్రసాధన సన్నద్ధులైన సిద్ధుల ప్రసిద్ధ విశుద్ధకథా శ్రవణప్రసంగంబుల వినోదించు దోహదబుద్ధిం దనరుచు. 9

సీ. మంత్రసిద్ధులు మహామహిమాధికులు తన
కుపదేశములు సేయుచున్నయట్లు
ఘనకౌతుకంబుతో గగనమార్గమునఁ దా
నొప్పుగా విహరించుచున్నయట్లు
విద్యాధరాంగనావితతి సంగీతంబు
లోలయేగఁ దనుఁ గొల్చుచున్నయట్లు
ఖతలంబునందుండి కడు చిన్నగాఁ దోఁచు
నుర్వీతలముఁ గాంచుచున్నయట్లు

తే. ప్రతిదినంబు నిజస్వప్నవితతిఁ గనుచు
నింత వింతగఁ దనమది వేడ్క లొదవ
మేలుకొని నిజముగ నిట్లు మెలఁగుపొంటె
నుత్సుకతమీఱ నపు డెన కొడవఁగోరు. 10

తే. అట్టు లాదేవి గోరుదేవైకసాధ్య
దోహదములెల్లఁ గడునేర్పుతోడఁ దనదు
మంత్రి తంత్రేంద్రజాలాది మహిమఁ బడయఁ
జేయదొరఁకొను యౌగంధరాయణుండు. 11

తే. అతఁడు గాపించు నయ్యుపాయముల నామె
గగనభాగంబున విహారగతి మెలంగు

వేడ్కఁ బౌరాంగనలు చాల వింతపడుచుఁ
గనులు పై కెత్తి పలుమాఱు గాంచుచుండ. 12

వ. ఇట్లు నిజదౌహృదంబు లెల్ల సిరగ్గళంబుగా నిర్వర్తిల్లుచుండ నొకానొకనాఁ డద్దేవి తన వాసగృహంబున సుఖోపవిష్టయై యుండి యేదేనియొక్క యుదారంబైన విద్యాధరచరితంబు విన వేడ్కనొందుచు వివిధవిశేషవిజ్ఞుండైన యౌగంధరాయణు నడిగిన నతం డచ్చోటి వారెల్లరు నాలకింప నామెకీ కథ నిట్లు సెప్పందొడంగె. 13

—◆ జీమూతవాహనకథ. ◆—

చ. అరయ ధరిత్రి నొప్పు నచలాళికెకాక, సమస్తదేవతే
శ్వరుఁ డగు పార్వతీపతికి శాశ్వతగౌరవపాత్రమై ధరా
ధరకుల చక్రవర్తి మహితస్థిరనిర్మలకీర్తి యంబికా
గురుఁడు హిమాచలేంద్రుఁ డతిగుహ్యసురసిద్ధగణాదిసేవ్యుఁడై.

తే. సకల విద్యాధరాధివాస మయి యున్న
యమ్మహాచలమందు విద్యాధరాధి
నేత యయి పొల్చు జీమూతకేతుఁ డధిక
వైభవోపేతుఁడై యుండువాఁడు దేవి! 15

క. అతని గృహాంతికవనిఁ ద
త్పితృక్రమాగతము కల్పవృక్షధ్వజ మభీ
ప్సితదాయకనామక మం
చితమై విలసిల్లు సకలసిద్ధిప్రదమై. 16

వ. ఇట్లిది తన యభీప్సితదాయక నామంబు సార్థకంబుగా న
జ్జీమూతకేతునకు సర్వదా మనోరథసిద్ధుల నొడఁగూర్చుచు
నతనిచే నర్చింపఁబడుచుండుటయు నంత నొకానొకదివసం
బున న వ్విద్యాధరేశ్వరుండు నిజోద్యానవనంబున కరిగి
యందు దేవతాత్మకమై విరాజిల్లుచున్న యక్కల్పద్రుమంబు
సన్నిధిం జేరి భక్తిపురస్సరంబుగాఁ బ్రదక్షిణప్రణామంబు
లాచరించి కృతాంజలియై యిట్లు ప్రార్థించె. 17

క. ప్రకట భవదీయ మహిమా
ధికత న్నే నెల్లవేళ దివ్యమహీరు
ట్ప్రికరోత్తమ! కొనుచుంటిని
సకలాభీష్టములు నీ వొసంగుచునుండన్. 18

ఆ. వె. నీయనుగ్రహమున నిక్కంబ యేను వే
ఱొక్క కొదవ లేకయున్నవాఁడఁ
గాన, నా కపుత్త్రికతయును దొలఁగించి
యొక్కతనయు సునయు, నొసఁగవలయు. 19

క. అని యర్థింపఁగ నపు డా
తనితో నమ్మహితకల్పధరణీజం బి
ట్లనె నోరాజేంద్రా! విను
జనించు నీకొకసుతుండు జాతిస్మరుఁడై. 20

వ. మఱియుఁ దత్సుతుండు నిరవధికదానరతుండును సర్వభూత
హితుండునై వెలయం గలవాఁడు నీ వింములకు నంది

యంబుఁ జెందవలదు; చను; మనుటయు నది విని జీమూత కేతుండు పరిహృష్టాంతరంగుండై తత్కల్పమహీజాతంబు నకుఁ బునః ప్రణామం బొనర్చి యరిగి యావృత్తాంతం బంతయుం దనదేవేరి కెఱింగించుటయు నందుల కామె యెంతయు సంతసించె నయ్యనంతరంబున. 21

క. కల్పమహీజము తెల్పిన
పోల్పున నాతనికి సౌఖ్య పుత్త్రుండు గుణా
నల్పుండు వొడమెఁ దత్సం
కల్పము నెఱవేఱ నచిరకాలములోనన్. 22

తే. అంత జీమూతకేతుఁ డయ్యాత్మజునకుఁ
దనర జీమూతవాహనుం డనెడు పేరు
వెట్టి కూరిమి చెలువొందఁ బెంచుచుండ
నక్కుమారుఁడు సహజదయాంధ్యుఁ డగుచు. 23

వ. సమస్తభూతంబులయందును బ్రభూతంబైన యనుకంపాతి శయంబు గలిగి మహాసత్త్వసంపన్నుండై వర్ధిల్లి క్రమం బుగ యౌవరాజ్యాధిపత్యంబు వడసి యొకానొకనాఁడు నిజసపర్యావిశేషంబుల మిగులఁ బరితృప్తుండైయున్న తన తండ్రితో లోకానుగ్రహకాంక్షం జేసి విజనంబున నిట్లని విన్నవించె. 24

క. జనకా! యీసంసారం
బున మన మార్జించు వస్తువులు సర్వము నా

శన మొందు నవియు; తిరమై
తనరును దోకకీర్తి యేకదా తలపోయన్? 25

ఆ. వె. ఎఱుక గలుగు పెద్ద లీక్షణభంగుర
ముగు పదార్థసమితియందుఁ దగులుఁ
గనక నిర్మలముగఁ గల్పాంతిసంస్థాయి
యగు యశంబ పడయ నభిలషింతు్రు. 26

క. అదియును బరోపకృతి సం
పద నుద్భవమైన వేఱ పలుకఁగవలెనే
మదిఁ దలఁప నుదారుల క
య్యదెకా ప్రాణాధిక ప్రియతర ధన మగున్. 27

ఉ. ఏయెడ నెట్టి సత్క్రియను నీయక యూఱక కూడఁబెట్టు త
చ్ఛ్రీ యది యుంచుకే నుపకరింపక పోవుట కాక చంచలం
బై యచిరప్రభాలతిక యట్లటనేఁ యడంగి దుఃఖసం
ధాయకమౌఁ దదార్జనమనస్కుల కెంతయు దున్సహంబుగాన్.

తే. కాన, మనదొడ్డిలో నున్న కామితార్థ
దాయకం బగు నకల్పతరువు పరుల
యుపకృతికి వినియోగించుచున్నయపుడ
కాదె తత్ఫలమును జెందఁ గనుట మనము? 29

తే. అక్కతంబున నే నింక నమ్మహీరు
హం బొసంగు ఫలంబు సర్వార్థిలోక

మునకుఁ జూఱఁగ విడుతు నో జనక ! దాన
నఖిలలోకము నదరిద్రమై సుఖించు. 30

చ. అని తనతండ్రితో సవినయంబుగ నీగతి విన్నవించి త
జ్జనకుని యాజ్ఞయుం బడసి సర్వజగత్ప్రియకార్యకాంక్ష చేఁ
జని యల దివ్యకల్పమహిజాతము చెంగట భక్తి సంయుతిన్
బ్రణతి యొనర్చి యాత్మగతభావము తేఁటపడంగ నిట్లనెన్.

ఆ.వె. మాటిమాటికీవు మాకభీష్టఫలంబు
లిచ్చుచుంటి వెన్నియెన్నియేని
కాన నేఁడు నొక్క కాంక్షితంబు వరింతుఁ
గరుణ నీయఁగదవె కల్పకంబ! 32

క. అది యేది యనిన విను చె
ప్పెద నో మత్ప్రాణమిత్త్ర ! పృథివితల మి
య్యది యెల్లను నీకృపచే
నదరిద్రము సేయు మిదె మదభిమత మాఘా ! 33

తే. ధనముఁ గాంక్షించు నీలోకమునకు నిన్ను
నిచ్చి వైచితి; నీవు తదిచ్ఛఁ దీర్చి
తృప్తిఁ గావింపు మొదు ప్రార్థింప నింక
మహితమహిజాత ! నీకు సేమ మగుఁగాత. 34

మ. అని యానిత్యపరోపకారపరతంత్రాత్ముండు జీమూతవా
హనుఁ డీతీరునఁ దన్ను వేఁడినఁ దదిచ్ఛాపూర్తిగా నానురా

వని జాతంబు మహీతలంబుపయిం దా వర్షించె సంపూర్ణకాం
చన వర్షంబుసమస్తలోకులుయథేచ్ఛన్ దృప్తులై పొంగంగాన్.

వ. అంత నాసమయంబున:— 36

తే. బోధసత్త్వాంశుండు దురు కృపాంబోధి సత్త్వ
వంతుండును నగుజీమూతవాహనునకు
సాటి యెవం డగు నర్థార్థిజనవశముగం
గల్పభూజంబు నెవ్వాండిం గలుగు నిల్లు ? 37

వ. అని యిివ్విధంబున లోకం బెల్లం బ్రస్తుతింప నజ్జీమూతవాహ
నుని యశంబు దేదీప్యమానంబై జాతానురాగింబులైన
దిక్కులయందును విదిక్కులయందును వివృద్ధంబై విస్తరింపం
దొడంగె; నంత నక్కుమారుని యశోవిశేషంబున నాబద్ధ
మూలంబై యున్న యాజీమూతకేతుని రాజ్యవైభవాతి
శయంబుం గనుంగొని మాత్సర్యవశంబునం దదీయగోత్రి
సంజాతు లతని యెడ వికృతిభావంబు వహించి యితం
డిప్పుడు తన కభీష్టదాయకంబై యున్న కల్పవృక్షంబును
ధనార్థులైన దరిద్రులకు దానార్థంబు వినియోగించి యున్న
వాండు గావున నితని కిప్పు డింక నెట్టి సదవలంబనంబును
లేద యిట్టి సమయంబున మన మితనిం బుత్త్రసహితంబుగా
జయించుట సుకరంబును యుక్తంబు నగు నని యెంచి వా
రందఱు నేకీభవించి యతనిపై దండెత్త సమకట్టుటయు నంత

నదియంతయుం దెలిసి ధీరశిఖామణి యగు జీమూతవాహ
నుండు తనతండ్రితో నిట్లనియె. 38

క. తలఁపఁగ మన యీ తనువులె
జలబుద్బుద సన్నిభములు జనకా! యెపుడున్
నిలుచునవి కావు ధరణీ
తలమునఁ గాలగతి వినిహతములై యడఁగున్. 39

వ. ఇవ్విధంబున మనశరీరంబులే యశాశ్వతంబులై యుండ నంత
కంటె నశాశ్వతంబులై ప్రవాతస్థలసంస్థితంబు లైన దీపకళి
కలచందంబున సంచలించుచుండు సంపద్వైభవంబుల నెవ్వ
రికై కాపాడుకొనువారు? మఱియునుంగాక, యట్టి యశాశ్వ
తైశ్వర్యంబులు పరపీడావశంబునం బడయవలసి వచ్చునేని
మానవంతులైన మానవు లెవ్వం డందుల కిచ్చగింప
నేర్చు? 40

క. కావున నో తండ్రీ! నే
నీ విభముఁ బొందెడుఁ దొడరి యీగోత్రజ పృ
థ్వీ విభులతోడఁ గయ్యముఁ
గావింపఁ దలంప రోషకలుషితమతినై. 41

తే. అస్థిరము లైన సిరులకై యాసపడను
గోత్రజులె వీని నన్నింటిఁ గొందురుగాక
యుర్వి నాకృపణులె సుఖముందురుగాక
స్వకులనంతయు మేఁ జేయఁజాల నయ్య! 42

తే. అట్లు గావున సకలరాజ్యంబు వారి
పాలుగా వీడి యే వనభాగమునకో
చని యచట సౌఖ్యముగఁ దపశ్చర్య సల్పు
చుందు నని పల్కుటయుఁ దదీయోక్తులు విని. 43

ఆ.వె. అతని తండ్రి యిట్టు లనె నాయనా! నేను
నిన్ను ననుసరించి నీవు సనెడు
కడకె వచ్చువాఁడఁ గాకున్న నిమ్మూఁడు
గాళ్ళముసలి కేమి గావలయును? 44

చ. తరుణుఁడ వయ్యు గోత్రజనధంబున కాత్మఁగలంగిసత్కృపా
పరత సమస్తరాజ్యవిభవంబుఁ దృణంబుగ వీడి నీవ యి
ట్లరుగఁ దలంప వార్ధకదశాతికృశాంగుఁడనైన యేను సు
స్థిర మని రాజ్యతృష్ణ నివసింతునె యీయెడ నోకుమారకా!

తే. అనుచుఁ బలుక జీమూతవాహనుఁడు తండ్రి
తలఁ పెఱింగి కరంబు సంతసము నొంది
తనదు తలిదండ్రులం గొని చనియె మలయ
పర్వతమునకు సకలసంపదలు విడిచి. 48

వ. ఇట్లు చని చందనతరుచ్ఛన్నగిరినిర్ఝరపరివృతంబును సిద్ధాది
వాసంబునై యొప్పు నప్పర్వతశ్రేష్ఠంబుపై నొక్కయాశ్రమ
పదంబున నివసించుచు వృద్ధులైయున్న యజ్జననీజనకులకుఁ దగు చి
తోపచారంబు లొనరించుచుండుటయు నయ్యనంతరంబున.

తే. అతని కచట విశ్వావసు వనెడు సిద్ధ
వల్లభు తనూజుఁ డత్యంతవశ్యబుద్ధి
సుగుణవంతుండు మిత్త్రావసుండు నాఁగఁ
బరఁగువాఁ డుత్తమస్నేహపాత్ర మయ్యె. 48

వ. ఇవ్విధంబున జీమూతవాహనుండు మిత్త్రావసునితో బద్ధ
సఖ్యుండై యుండి యొకనాఁ డేకాంతంబున నమ్మిత్త్రావసువు
చెల్లెలిం గన్యకయై యున్నదానిం గనుంగొని తాను బూర్వ
జన్మజ్ఞాన సంపన్నుండై యున్నవాఁ డగుటం జేసి యది తనకు
జన్మాంతరంబునం బ్రియతమయై యుండుట యెఱింగె; నా
సమయంబున. 49

తే. తరుణు లగువారి యన్యోన్యదర్శనమ్ము
లొండొరుల చిత్తమృగముల నొడిసిపట్టు
వాగురాబంధనంబునంబలెఁ దనర్చెఁ
దత్పురాతనజన్మబోధమునఁ జేసి. 50

వ. ఇది యిట్లుండఁ బరంపడి యొక్కనాఁ డాకస్మికంబుగా నమ్మి
త్త్రావసుండు త్రిజగత్పూజ్యుండగు తన మిత్త్రరత్నంబు నజ్జీ
మూతవాహనుం జేరఁ జనుదెంచి ప్రణయపూర్వకంబుగా
నతని కిట్లనియె. 51

క. మలయవతి యనఁగ నాకో
చెలికాఁడా! తనరు నొక్క చెలియలు కన్య

తిలకంబు దాని నీ కేఁ
దలఁచితి నాకోర్కి యన్యథా సేయకుమీ! 52

సీ. అనుటయు నది విని యత్యంత సంతోష
మంది జీమూతవాహనుఁడు నిట్టు
లనియె; నో యువరాజ! యకన్య ప్రాగ్జన్మ
మందును నాదు భార్యయె సుమయ్య
యాజన్మమున నీవు నఱపార లెఱుఁగని
యనుఁగు సంగడికాఁడ వైతి నాకు
విను ము; జాతిస్మరుండను నేను దొల్లింటి
పుట్టు పూర్వోత్తరంబుల తెఱంగు
తే. లన్నియు నెఱుంగుశక్తి నా కన్న దిప్పు
డనిన మిత్త్రావసుఁడు మిత్త్రమా! వినంగ
వేడ్కవొడమెడు; నపూర్వవృత్త మెల్లఁ
దెల్లముగ నాకుఁ జెప్పఁగదే మహాత్మ! 53

వ. అని యిట్లు సకౌతుకంబుగా మిత్త్రావసుం డడిగిన విని యా జీమూతవాహనుండు తనపూర్వజన్మవృత్తాంతం బిట్లు సెప్పం దొడంగె. 54

క. వినుము సఖా! నేఁ దొలి బా
మున నొక విద్యాధరాధిపుని యాత్మభవుం
డను గగనచరుఁడనై యెం
దును వడిఁ జనుచుండువాఁడను యథేష్టముగాన్. 55

ఆ.వె. అట్టు లుండి యొక్కయవసరమున హిమా
చల మనోజ్ఞ శిఖరసరణిఁ బట్టి
యభ్రపథిఁ జనుచు నడుగున గౌరితోఁ
గ్రీడసలుపు హరుని జూడఁ గనక. 56

క. వడి నుల్లంఘించి తోడిం
బడిపోవఁగఁ జూచి య య్యుమాపతి నాపైఁ
గడు నలిగి మర్త్యయోనిం
బడు మని శపియించి యిట్లు పలికెం బిదపన్. 57

ఆ.వె. అవని మానవుండ వయ్యు విద్యాధర
కాంత నొకత భార్యగాఁగఁ బడసి
నీకుమారు నచట నీపదంబున నిల్పి
పూర్వజన్మవృత్తముల నెఱింగి. 58

వ. వెండియు నీవిద్యాధరత్వంబు వడయుదు వని యనుగ్రహించి శాపాంతం బొసంగి యాశంకరుండు తిరోహితుండై చనుటయు నేనును దోడన యీభూతలంబున కరుదెంచి యుందు.

క. వలభీనామక నగరిం
గలిత మహైశ్వర్యుఁ డగు నొక వణిక్పతి కిం
పొలయఁ దనూజాతుఁడనై
వెలసితి వసుదత్తుఁ డనెడు పేరఁ బరఁగుచున్. 60

వ. ఇట్లవ్వణిగ్గృహంబున నుద్భవించి యందు సమస్తసౌఖ్యసముపేతుండనై వర్ధిల్లి కాలక్రమంబున యౌవనవంతుండ

నై యుండుటయు నంత మాతండ్రి నాకు సకలపరిచ్ఛదంబులు నొసంగి వాణిజ్యంబు సేయ నియమింపఁ దదీయాజ్ఞానుసారంబుగ దేశాంతరంబున కరిగి విశేషవిత్తార్జనంబుఁ గావించి తిరిగి వచ్చుచుండ నమ్మార్గమధ్యంబునం దొక్క మహారణ్యభాగంబున నుర్వివారులైన కొందఱు తస్కరులు నాపయిం బడి నాయొద్దం గల మొల్లం బెల్లఁ గొల్లఁగొట్టి నన్నుఁ బట్టి రజ్జుబంధంబుల దృఢంబుగఁ గట్టి తమపల్లియకుం దోడ్కొనిపోయి యచ్చట. 61

తే. బలి పశు ప్రాణ భక్షణ ప్రసర దుగ్ర
తరకృతాంత జిహ్వాకయనం దనరు విచల
దాయతారుణధ్వజ పట మగ్రిమందు
వెలయ నొప్పెడు చండికానిలయమునకు. 62

క. కొని చని యట దేవీపూ
జనపరుఁడై యుండఁ గని నిజప్రభు నికటం
బున నుపహారార్థంబై
నను నిల్పిరి హృదయభీషణంబుగ నంతన్. 63

తే. అప్పులింద విభుండు న న్నట్టిచూచి
తాను శబరుండ యయ్యుఁ జిత్తమునఁ గరుణఁ
జెందె; జన్మాంతరప్రీతిచే నొకప్డు
కారణము లేకయున్నను గరఁగు మనసు. 64

వ. అంత నప్పాళింద వల్లభుం డట్లు నిష్కారణజాయమానకటా
క్షుండై న న్నాఘోరవధంబునుండి తొలంగించి తద్దేవీపూజా
సమాపనం బాత్మోపహారంబునం గావింప నిశ్చయించుటయు
నంత నొక్క దివ్యవాణి యతని నుద్దేశించి నాయనా! నీ
విట్లాత్మోపహారంబుఁ గావింపఁ గడంగకు; మేను నీకుఁ దద్ద
యుం బ్రసన్నురాల నైతి;నభిమతం బైనవరంబు వేఁడు;మది
నీకు నే ననుగ్రహించెద ననిన నద్దేవి వచనంబు లాలకించి
యప్పాళిందవిభుండు పరిహృష్టాంతరంగుండై సవినయంబుగా
నామె కిట్లనియె. 65

శా. అమ్మా! నీవు ప్రసన్న వైతి విటు నా కత్యంతకారుణ్యభా
వ మ్మొప్పారఁగ; నింక వేఱ వరముల్ వాంఛింప నేమున్న;వీ
విమ్మాడ్కిం గరుణింతు నంటి వని నే నిక్కోర్కి యొక్కండ నా
కిమ్మంచున్ వరియించు చుంటి నదె నా కీ విమ్ము లోకేశ్వరీ!

వ. అవ్వరం బేమందు వేని విన్నవింతు నవధరింపుము. 67

ఆ. వె. ఇప్పు డిచట నున్న యివ్వఁశిశుసుతునితో
ముందు వచ్చు జన్మమందుఁ గూడ
సుదృఢమైన చెలిమి యొదవు నట్లు ప్రసన్న
వగుము నాకుఁ దల్లి! యాదిశక్తి! 68

తే. అనిన నట్టులె యగుఁగాక యనుచు దివ్య
వాణి విరమింప నంత నవ్వార దయాళు

వైన శబరేశ్వరుండు నాయర్థ మెల్ల
మరల నాకుఁ గటాక్షించి కరముఁ గూర్మి. 69

ఆ.వె. వివిధ వన్యవస్తు వితతియుఁ గృపచేసి
ఘనత వెలయ మిత్రుల గౌరవించి
యడవినుండి కష్టపడకుండ నే నిల్లు
సేరఁ దగిన వెరవుచేసి యనిపె. 70

వ. ఇవ్విధంబున నే నప్పుడు మృత్యుముఖంబునుండియుఁ బ్రవాసంబునుండియుఁ బరిత్యాగతుండనై కడచిన వృత్తాంతం బంతయు మా తల్లిదండ్రుల కెఱింగింప వా రెంతయు నచ్చెరువొంది మరణించిన నీ మారుండు మరల బ్రదికి వచ్చె నని సంతసించి మహోత్సవంబుఁ గావించి; రయ్యనంతరంబున మఱి కొంత కాలంబునకు. 71

క. కానన భూమిలోపల నొకానొక సార్థముఁ గొల్లఁగొట్టి య
న్యూనధనంబు వొంగిల మహోగ్రరుష న్నృపభృత్యు లుర్వి
రాజానియనుజ్ఞ నేఁగి రథనంబుఁ దచ్ఛబరాధినేత నా
స్థానికిఁ గట్టితెచ్చి విభుసన్నిధిఁ బెట్టిరి మత్పురంబునన్. 72

తే. అంతఁ గార్యాంతరమున నే నచటి కరిగి
కాంచితిని నాకుఁ బూర్వోపకర్తయైన
యాశబరనాథు ఘోరశిక్షార్హు సుభట
పరివృతుఁ బటిష్ఠపాశనిబద్ధబాహు. 73

క. కని యొంతయుఁ గటకటపడి
చని నాజనకునకుఁ దెల్పి జననాథుని నేఁ
డ్కొని యిడితి నూఱువేల్ గాం
చనములఁ దన్మరణశిక్ష శమియింపంగన్. 74

వ. ఈ తెఱంగున నతని నిమిత్తంబు లక్షసువర్ణంబులు దండంబు
గా నొసంగి. 75

క. మును నాకుఁ బ్రాణదానం
బును గావించిన దయాళువున కాశబరే
శునకుఁ దగఁ బ్రత్యుపక్రియ
యొనరిచి విడిపించి వెలిమి యొప్పఁగ నతనిన్. 76

వ. సమస్తవస్తుసంపూర్ణంబైన మద్గృహంబునకుఁ గొనిపోయి
యందుఁ గొంతకాలం బతని కనేకవిధసమ్మానంబులు గావించి
యుచితవిధంబున సంభావించి యనుపుటయు. 77

తే. ప్రణయపేశల మగు తన భావ మెల్ల
నా యెడన నిల్పి నను విడనాడలేక
యెట్టకేలకు నా శబరేశ్వరుండు
చనియెఁ దనపల్లియకు సంతసమ్ము వెలయ. 78

సీ. అట్టు లాశబరేశుఁ డాత్మదేశంబున
కరిగి వెండియును నాకర్థమైన
ప్రత్యుపక్రియకునై ప్రాభృతం బేదేని
యొసఁగ నెంచుచుఁ దనయొద్ద నున్న

కస్తురియును మౌక్తికములును మున్నుగాఁ
గల వస్తువు లవంత ఘనత గలవి
గా వని యవ్వానికంటె నత్యుత్తమ
మౌక్తికజాలంబు మదగజేంద్ర

తే. కుంభములు వ్రచ్చి కొనితేరఁ గోరి ఘోర
చాపమాత్రద్వితీయుఁడై చనియెఁ దుహిన
శైల దుర్గమ కానన స్థలుల కుగ్ర
వన్య మాతంగయూథ నివాసములకు. 79

క. చని యతఁ డాహిమనన్నగ
వనముల నిటునటునఁ దిరుగువాఁ డొకచోటన్
గనెఁ దీరస్థిత దేవభ
వన ముగు నొక పెద్ద సరసి వనధియుఁ బోలెన్. 80

తే. అంపు మిత్త్రానురాగంబు లగుటఁ దనకు
సాటి సేయంగఁ దగు జలజాత జాత
ములను గనుఁగొని సంజాతమోహుఁ డగుచు
దత్తటంబునఁ బ్రొద్దెక్కుదనుక నిలిచి. 81

చ. పనిపడి యెండవేళ జలపాన మొనర్పఁగ గుంపుగుంపుగా
వనగజయూథ మచ్చటి కవశ్యము వచ్చుచునుండునంచు న
మ్మనమున నెంచిగొబ్బ నెడమాటుగఁ బొంచిశరమ్ములున్నరా
వనమును దాల్చియుండెగజసంఘజిఘాంస ఏనిశ్చలంబుగాన్.

వ. అంతఁ దత్సరోవరతీరగత భవనగతుండై యున్న త్రిభువన గురుండగు భవానీభర్త నారాధింప సింహవాహనారూఢయై చనుదెంచుచున్న యొకానొక యత్యద్భుత దివ్యరూప సంపన్నయగు నవనాగినీకంబుం గనుంగొని, కన్యకాభావవర్తినియై శంభు పరిచర్యాపరత్వంబున నున్న యవర తుషారాద్రిరాజపుత్రిక యోయనఁదగియున్న యక్కన్నియ రూపలావణ్యాది విశేషంబుల కత్యంత విస్మయాక్రాంతుండై యా శబరకాంతుండు తన మనంబున నిట్లు వితర్కింపం దొడంగె. 83

సీ. ఎవ్వతె యగునొకో యిక్కన్యకామణి!
మానవ యువతి యగానేని సింహ
వాహనారూఢ యెవ్వడుపున నగు? వేల్పు
పొలఁతుక యైన నాఁబోఁటిపాని
కనుల కేరునఁ గానంగఁబడుఁ? గాన
నిజముగా నిది నాదు నేత్రయుగళ
పూర్వపుణ్యము లెల్లఁ బోగ్రువయి యుబ్బంగఁ
బరిణమించిన మూర్తి భంగియ యగు

తే. నీమె నలనాదు మిత్త్రిన కెట్టులేని
నేర్పునం జేసి కూర్పంగా నేరనేని
యనొరి కిఁకఁ బ్రత్యుపకృతియు యార్ద్రభంగి
నాచరించినవాఁడ నెట్లగును నేను? 84

తే. కాన, నిక్కన్యకామణికడకుఁ బోయి
తెలిసికొందునుగాక తదీయవృత్త
మనుచుఁ దలపోసి నామిత్త్రి యప్పుళింద
నేత యల్లన దాని సన్నిధికిఁ జనియె. 85

వ. అంతలో నక్కన్యకారత్నంబును దన వాహనసింహంబు నొక్కచెట్టునీడ నిల్పి తా నమ్మృగేంద్రంబుపై నుండి క్రిందికి డిగ్గి యాసరస నున్న సరసియందు వికసితంబులై విలసిల్లు నెల్లదామరల నవపూజార్థంబుఁ గోయందొడంగి కొంతవడికి నిజాంతికంబునఁ గృతానతుండై నిలిచి యున్న యాశబర రాజుం గనుంగొని యపూర్వదర్శనుండై యున్న యతని కతిథిప్రీతివశంబున స్వాగతం బొసంగి యనురంజించి. 86

ఆ.వె. ఈ వెవండ? విప్పు డీమార్గమారణ్య
భూమి కేల్లు రాఁ బనేమి? యనుచు
నడుగ నంత నామె కాశబరోత్తముఁ
డిట్లు సెప్పఁదొడఁగె నెసఱ మొసఁగ. 87

తే. అమ్మగో! నే భవానీ ప్రద్రైక శరణుఁ
డైన శబరాధిపుఁడ; నీ హిమాచలేంద్ర
కాననంబుల మద మతంగజభవంబు
లైన ముత్తియములఁ బోయఁగఁ దలంచి. 88

క. అరుదెంచినాఁడ; నియ్యెడ
నారక నీ దర్శనంబు దుర్లభ మిది; ని

క. అని యాశంబరేంద్రుఁడు ప
ల్కఁగ విని యాకన్య మీనకేతనసంమో
హనమంత్రాక్షరముల తెఱఁ
గునఁ దద్వచనములు తవులుఁ గొలుపఁగ నంతన్. 95

క. రతివల్లభతంత్రప్రే
రితయై తద్వ్యాధవరునిఁ బ్రియభాషణపో
షితుఁ జేసి యిట్లు లనెఁ బరి
భృత మంజుల గళ సనాద పేశల రుతియై 96

తే. శబరకులనాథ! నీయిష్టసఖుఁ డతండు
తెలుపు మదేచట నవుడు వర్తించు చుండె?
నట్టి సౌందర్యపరసీమ యైనయెడల
నతనిఁ గొనివచ్చి చూపింప నగునె నాకు? 97

వ. అనిన విని యాశబరేశ్వరుం డట్ల సేయంగలవాఁడ నని పలుకుచుఁ దత్క్షణంబ యామెపిశికోలు విడచి తా నింకఁ గృతార్థుండ నైతి నని సంతసించుచు నయ్యెడనుండి బయలు వెడలి తనపల్లియ కరుదెంచి కొన్ని వస్తువులం గొని కస్తూరియు ముత్యంబులును మున్నగు మహార్ఘవన్యవస్తునివహంబు భారశతహార్యంబుగ నవి వెంటం జేకొని మద్గృహంబున కేఁగు దెంచి యందు మాయెల్లరచేతం బురస్కృతుండై బహుస్వర్ణలక్షమూల్యంబైన యయ్యుదుగర యెల్ల మాదియ జనకున కర్పించి. 98

తే. బహువిధమహోత్సవముల నాఁటిపవలు గడవ
నంత నారాత్రి యతఁడు నాయంతికమ్మ
నంద శయనించి యుండి రహస్యమందుఁ
దెల్లముగఁ గన్య సంగతి తెలియఁ బలికె. 99

క. రమ్మిప్పుడె యటకు; రహ
స్యమ్ముగఁ బోవుద మటంచు సముద్గతౌత్సు
క్యమ్మునఁ దగు నను గొని చే
గమ్మగ నయ్యర్ధరాత్రిఁ గదుఁ దెలివమెయిన్. 100

తే. చనియె; నంతట నమ్మఱునాటి దినంబు
ప్రొద్దుట మదీయజనకాదు లిద్ది యేమి!
యనుచుఁ దాలుదొల్ల కలవర మంది కడకు
శబరపతితోడ, నే నెటో చనుట యెఱిఁగి. 101

వ. అతనియెడఁగల ప్రణయప్రత్యయంబునం జేసి ధైర్యంబు
వహించి యుండి; రంత నన్నా శబరేశ్వరుం డెల్లు కొనిపోయి
నాకు వలయు మార్గోపచారంబు లన్నియు యథానుకూలం
బుగ నిర్వర్తించుచు నతిత్వరితప్రయాణంబులఁ గ్రమంబుగఁ
దుషారశైలంబునకుఁ దోడ్కొనిపోవుటయు నంత మే మా
సాయంసమయమ్మునఁ దత్సరోవరతీరంబున కరిగి యుండు.

క. నీరజ రజస్సముదిత
సౌరభమై తనరు తద్విశద శీతల వా:

పూగమునఁ దోఁగి కృతసం
స్కారులమై సేద దేఱి సంతోషముగాన్. 103

క. అతి మధురం బగు ఫలసం
తతిఁ గడుపారఁగ భుజించి తత్సరసీసం
భృతమధురపయోమృతపా
నృతి పాన మొనర్చి తనిసి మే మచ్చోటన్. 104

సీ. అలరుఁ దీవియలు నిండారఁ జల్లినవిరుల్
గుమగుమ తావుల గుబులుకొలుపఁ
దేఁటిబోఁటులు మాటిమాటికిం బాడు తీ
యని పాటలింపుగాఁ గనుల మోడ్పఁ
గమ్మగాఁ జల్లఁగాఁ గడు మెల్లమెల్లఁగా
మలయ తెమ్మెరలు మై మఱపుఁగూర్ప
మిలమిల లాడుచు మెఱసెడు మందు తీ
నలు చీఁకటులఁ దోలి వెలుఁగొసంగ

తే. నలరు నిలుకాని చెయ్యంపుఁ జెలువ కూర్చు
పదుకటిల్లనఁ జెలువమై పరఁగు నచటి
మంచుమలకాన నొకట మే మఱచి నిదుర
వోయి కడపితి మానాఁటిరేయి మేము. 105

వ. అంత నమ్మఱునటినాఁటి ప్రొద్దుట మాటిమాటికిం బాడము
చుండు నాయూకోరుకు లీరికలెత్తఁ దత్తరంపడుచున్నమదీయ
చిత్తం బత్తన్విపైఁ బ్రత్యర్థానం బొనరింపఁ జనుచుండు వడు

వున వడివడిం దదీయమార్గంబున కెదురుగ బరువులెత్తు
చుండ, మఱియు నయ్యంగదగత్తియుం గనుంగొనం గోరి యుర్వి
ఘూర్ణరుచు నెగిరియెగిరి పడుచున్న చందంబున నదరుచున్న
నాకుడికన్నప్పుడంతుకరాకను సకినంబులు సెప్పుచుండఁ
గొంతవడి కాకన్యకాతిలకం బచ్చటి కరుదెంచెఁ దత్సమ
యంబున. 106

క. కనుఁగొంటి నేను నయ్యం
గన మత్తమృగేంద్రపృష్ఠగ సిత సటా మ
ధ్య నిషణ్ణ; నమలిన శర
ద్ఘనమండలి నొప్పు జంద్రకళఁ గనుమాడ్కిన్. 107

వ. అంత. 108

క. అచ్చెరువు వెఱపు వేడ్కయుఁ
బెచ్చుపెరుఁగ నమ్మృగాంకబింబాస్యఁ గనన్
నచ్చెలి! నాహృదయం బపు
డచ్చట నెఱు లున్నయదియు నేన యెఱుఁగన్. 109

వ. పదంపడి యాసుందరాంగియు నిజసింహవాహనంబు నవతరించి
భర్గపూజార్థంబు పరిశుద్ధంబులైన పుష్పంబులం గోసికొని
తత్సరోవరంబునఁ గొంతతడవు జలకంబులాడి తీరస్థితుండైన
గౌరీవల్లభు నత్యంతభక్తిభావంబున నారాధించి సుప్రసన్నాం
తరంగయై యుండుటయు నంత నాప్రియసఖుండైన శబరే
శ్వరుం డల్లన నప్పల్లవపాణిచెంత కరిగి నమస్కరించి తన్నుం

దెల్పుకొని యామె తన్నంతయు సాదరింప సవినయంబుగా
నామెతో నిట్లనియె. 110

క. కొని తెచ్చితి దేవీ! నా
యనుంగుఁ జెలికాని నతని, నవ్వల నీ కొ
ప్పిన హృదయేశుఁడు నగు వా
నినిఁ; జూపు మటన్నఁ దెత్తు నీసన్నిధికిన్. 111

క. అనిన విని యవ్వేలందియుఁ
గనిపింపు మటంచుఁ బలుకఁగా నామిత్రుం
డును వేగ వచ్చి ననుఁ దో
డ్కొని చని చూపించె నచ్చకోరేక్షణకున్. 112

వ. అంత. 113

చ. ప్రణయరసంబు వెల్లియయి పర్వఁగ నత్తరళాక్షి నన్ను ను
న్నని కడగంటిచూపుల మునుం బలరారఁగఁ జూచి తోడనే
మనసిజుచేతి కీలుబొమ్మమాడ్కి దివ్యమె శబరేశుతోడ ని
ట్లనె దరహాసచంద్రికలు నాననబింబము వెల్లఁబాఱఁగన్. 114

క. ఏమోయి! శబరనాయక!
నీమిత్రుఁ డితండు కనుము నిజముగ మనుజుం
డా? మము వంచింపఁగ నే
కామచరుండైన వేల్పొ గా కిటువచ్చెన్. 115

ఉ. మానవుఁ డంచు మమ్ము వెడమాయలు సేయఁగఁ జూచి
నాఁడ, వౌ! నౌ, నిది యింత నేమెఱుఁగమా! విను; మాన

వుఁడేడ? నీ రతి! ప్రాణాధినాథానూనయై భాసిలు నాకృతి
యేడఁ? గార్యసంధానపటిష్ఠ! యిట్టి యనృతంబుల నెయ్యెడ
నేర్చితో కదా! 116

వ. అని యిట్లక్కన్యక నర్మగర్భంబుగా నాశబరాధిపతితోఁ
బలుకుటయు. 117

తే. అంత నే నది విని యిట్టు లంటి న వ్వా
లాది హృదయంబునం గల సందియంబుఁ
బాపి నమ్మింపఁ దలఁచి, యోభాసురాంగి!
నమ్ము; మిది నిజ; మేను మానవుఁడఁ జుమ్మ. 118

ఆ. వె. ఆర్జవమునఁ బోలుచు నట్టి వారలకడ
వంచనమ్ము లేల పలుమఱుఁ జేయ?
దలిరుఁబోఁడి! చెప్పెదను నీకు నా యుదం
తంబు సంగ్రహముగ; దాని వినుము. 119

వ. ఏను మలయగిరివాస్తవ్యుండైన "మహాధన" నామకుండగు
సార్థవాహునకు మాహేశ్వరవర సంభూతుండనైన తనూ
జాతుండ; మున్ను మాతంగాద్రి పుత్రలాభార్థంబు చంద్ర
శేఖరు నుద్దేశించి తపంబొనర్పఁ గడంగుటయు నంతఁ దదీయ
తపోవిశేషంబున కలరి యద్దేవదేవుం డతని కిట్లనియె; నోయి
వర్తకోత్తమా! లెమ్ము; నీ కొకానొక మహాత్ముండైన
నాత్మజుం డుద్భవింపం గలవాఁడు; డిది యొక్క పరమం
బైన రహస్యంబు; విప్పి డిది యింతకంటె విస్తరించి చెప్పం

బనిలే; దని యిట్లానదాశివుం డానతిచ్చిన నది విని నా
జనకుండు మెల్లొని మహానందమగ్నమానసుండై యుండెఁ;
బదంపడి కాలక్రమంబున నే నతనికిఁ బుత్త్రుండనై జన్మించి
వసుదత్తుం డనుపేరఁ బరఁగుచున్నవాఁడ; నీ శబరనాయకుం
డొకానొకకాలంబున నేను దేశాంతరగతుండనై యున్నతఱి
నాకు నిష్కారణాపద్బాంధవుండై తనయంతం దాన నన్నుఁ
దన కత్యంతాప్తమిత్త్రంబుగా వరించికొని యున్నవాఁ;
డియ్యదియ మదీయవృత్తాంతతత్త్వసంక్షేపం బని యిట్లు
చెప్పి నే నూరకుండుటయు నంత నక్కన్యకారత్నంబు
లజ్జావనతముగ్ధముఖమండల యగుచు నిట్లనియె. 120

తే. ఔను నీ వానతిచ్చిన యది నిజంబ;
యేను నెఱుఁగుదు; నిన్ను మదిష్టదేవ
మీశ్వరుఁడు నాదుపూజల కెలమిఁ జెంది
స్వప్నమున నాకుఁ గరుణ సాక్షాత్కరించి. 121

ఆ. వె. ఎల్లి నీకుఁ దగిన హృదయేశ్వరుం డిట
కరుగుదెంచు నంచు నానతిచ్చెఁ
గాన, నతఁడ వీవకాఁ దగు; నింక నా
ప్రాణవల్లభుఁడవు పతివి నీవ. 122

క. దోనఁ గెన్నకు మని యిటు లా
బిసరుహపత్త్రాక్షి ప్రణయపేశలమతియై

ముసిముసి నవ్వుచు సిబ్బతి
గుసగుస నీవాగమృతము గురిసిన యంతన్. 123

క. ఇట్టి దని తెలుపఁగా లే
నట్టి మహానందలక్ష్మి కాస్పదమై య
ట్టిట్టునుచుఁ గొంతవడి నే
నట్టె నిలుచుండి పిదప నతని కౌతుకమునన్. 124

వ. ఆ బాలికారత్నంబుతోఁ గూడ సంబల్కి కొని యథావిధి దానిం బరిణయంబు చేసికొనుపొంటె మన్మిత్త్రసమేతంబుగా మదీయ గేహంబునకుఁ దోడ్కొనిపోవ నిశ్చయంబుఁ గావించుకొను టయుఁ దక్షిణంబు యక్కన్యకాతిలకంబు తన హార్యక్ష వాహనంబునకు సన్నఁగావించి సమీపంబునకుఁ జేరంబిలిచి.

ఆ.వె. ఆర్యపుత్త్ర! యిమ్మహాసింహవాహంబు
నధివసింపు మనుడు నంత నేను
శబరవిభునితోడఁ జని యమ్మృగేంద్రంబు
మీఁద నెక్కి ముదము మీఁగమీఁఱ. 126

ఉ. అత్తలిరాకుఁబోఁడి మృదుహస్తయుగ్మముఁ బరిగ్రహించి పై
కెత్తి మదంకభాగమున నెంతయు నంతస మొప్పఁ దాల్చి యా
యుత్తమకన్య నిప్పు డిటు లొంది కృతార్థుఁడనైతినంచు మ
చ్చిత్తములోఁ గడానముదముఁ జెందుచు వేడుక విఱ్ఱవీఁగుచున్.

వ. నిజగృహోన్ముఖుండనై బయలువెడలి, మాకిర్వురకుం బుర స్సరుండై యున్న మదీయమిత్త్రుం బాశబరేశ్వరుం డుండఁడు

తే. మన్నన మెసంగ నాకు సమస్కరించి
యిట్లనియె; నోకుమారకా ! యేను దేవ
యోనిఁ, జిత్రాంగదాఖ్యుఁ డనంగఁబడుచుండు
వాఁడ విద్యాధరుండ; శాపచ్యుతుఁడ. 135

క. ఇక్కన్య నాదు సుత, స
మ్యక్కలితమనోవతీ సమాభిఖ్య, గడున్
మిక్కవతోఁ బ్రాణములకు
నెక్కువగాఁ గూర్తు దీని నే నపుడంబున్. 136

వ. అక్కతంబునం జేసి:— 137

చ. అనవరతంబు దీని విడనాఁడక పార్శ్వమునన్ ధరించి స
ద్వనములయందుఁ గ్రుమ్మరెడువాఁడఁ; బదంపడి యొక్క
నాఁడు నేఘనతరసత్తపోవనసికాయవిభూషితతీరయైన గం
గను దరియంగ నేఁగి యట గాఢతపస్విలసన్మహాత్ములన్.

తే. మీఱి లంఘించి చనుటది మేలుగాదు
నలుకుచుఁ దలంగి యవు డమ్మహాస్రవంతి
పాఱుచున్న ప్రవాహంబు పైని మింటి
నడిమిత్రోవను బట్టి నే వెడలుచుండ. 139

క. గాలివడిఁ దూలి నా మెడఁ
గ్రాలెడు పూదండ యొకఁడు గ్రిక్కన గంగా
కూలాంతికతోయంబుల
వ్రాలెన్ బ్రారబ్ధకర్మవశమున నంతన్. 140

వ. తజ్జలాంతరస్థితుండై తపంబుసేయుచున్న నారదమహామునీం
ద్రుం డాకస్మికంబుగా నయ్యంబు మధ్యంబునుండి పైకి
లేచుటయు నంత నక్కుసుమమాలిక యమ్మహాముని మూఁ
పునం బడియె; నక్కాలంబున నతం డప్పు డెంతయుం గోపించి.

సీ. ఔరౌర! పాపాత్మకా! యేల నీకింత
యౌద్ధత్య? మిచట మమ్మెఱియఁబోక
నీ విట్టు లపవిత్ర నిర్మాల్యమున మమ్మ
మైలపఱ్తువె నీతిమాలి? యోరి!
నీగర్వ మడఁగ వేవేగ సింహాకృతిఁ
బడయుము, వబ్బంగిఁ బడసి నీవు
తనయు డీసని సంతతము మూఁపునం దాల్చి
మెలఁగుచుండెదు, హిమవాచలమునందు

తే. గీ. నేనాఁడు కొండొక మానవుండు
పరిణయం బగు నానాఁడు ధన్యమైన
యుద్వాహోత్సవముఁ గాంచి నంతలోనఁ
దొలఁగు మాశాప మిది నీకు ధూర్త! పాప్మ! 142

క. అని యివ్విధమున నారద
మునివరుఁడు శపింప వేగముగ హిమశైలం
బున కరిగి సింహమై య
త్తనయున్ శివపూజనాతితత్పరు దీసెన్. 143

సంతసించుటయు సంత నాజనకుం డట్లు పరితుష్టుం డైయున్న యమ్మహీపాలునకు మనోహరం బైన రత్నోపాయనంబు నట్టి యొసఁగె నా శబరేశ్వరున కశేషాటవీరాజ్యంబునకు నాధిపత్యంబు నిప్పించె; నయ్యనంతరంబున. 148

ఆ. వె. అనుఁగుఁ బత్నియైన యమ్మనోవతితోడఁ
బ్రాణమిత్రపాత్రమైన యట్టి
శబరరాజుతోడ సౌఖ్యంబుగా నుంటి
నచట ధన్యతముఁడ నగుచు నేను. 149

తే. ఆ శబరివల్లభుండును నాత్మదేశ
గమనమున వేడ్కఁ గొనక, నాకడన నిల్చి
చిరము మద్గృహమందు వసింపఁ దొడఁగె
నాత్మబంధులకంటె నత్యాప్తుఁ డగుచు. 150

వ. అట్టి యెడనము యందున. 151

ఆ. వె. ఒకరి కొకరు కూర్మి నుపకృతు లెన్నని
చేసికొనియుఁ దృప్తిఁ జెందకేము
కలసి మెలసి సుఖముగా నుండఁ గాలంబు
గడచె మాకుఁ జెలిమి పొదువు గాఁగ. 152

వ. పిదంపడి యచిరకాలంబునందు బహిర్గతం బైన మదీయ కృతప్రజ్ఞాఫల మహోత్సవంబు చందంబున నమ్మనోవతియందు నాకొక్క కుమారుఁ డుదయించుటయు నేనతనికి హిరణ్యగుప్తుం డని పేరువెట్టి యాతండు కాలక్రమంబునఁ బరివర్ధితుం

డైన పిమ్మట సుచితవిద్యలం గఱపించి పరిణయం బొనరిం
చితి; నంత నతివృద్ధుండైయున్న మజ్జనకుం డయ్యాది గనుం
గొని నంతసించి యంతటితోఁ దన జీవితఫలం బంతయు
సంపూర్ణం బయ్యె నని భావించుచు భార్యాసమేతంబుగా
దేహోత్సర్జనంబుఁ గావించుపొంటె భాగీరథీతీరంబున కరిగె
నాసమయంబున. 153

సీ. అనుఁగుఁ దల్లియుఁ దండ్రియును నట్లు సనినఁ ద
చ్ఛోకంబుచే నేను వ్యాకులుండ
నై యుండ నపుడు మదాప్తబంధువులు నా
కనుకూలవరణి ధైర్యంబుఁ గొలిపి;
రంత నే వారి ధైర్యాలాపములఁ దేఱి
మద్గృహభారంబు మరలఁ దాల్చి
యొకవంకఁ బ్రియసతీ వికచముగ్ధముఖాబ్జ
దర్శనోత్సవము మోదంబుఁ గూర్ప

తే. మఱియు వేఱొక్కవంక నమ్మహితశబర
నాథ సాంగత్య మది మహానంద మొసఁగఁ
దృప్తహృదయుండనై వినోదింపఁ గంటి
నేమని వచింతు నాఁటి నాయెలమి కలిమి? 154

తే. చనియె నా కాదినంబులు నమధికాత్మ
నందనానందములు, మహోన్నతకళతృ

భావసుమనోజ్ఞములు, సుహృద్వివరసమాగ
మాతిసుఖములు నగుచు సిద్ధార్థపసుత! 155

వ. అంత నేను గాలక్రమంబునఁ బ్రవృద్ధ వయస్కుండ నగు టయు నాయందలి ప్రీతివశంబునం జేసి పుత్రకా! నీవింకను గృహంబునందయుండ నేలని యీవాటికిఁ దపోవనంబున కరుగఁజనదే యని హితంబు చెప్పుచున్నదియుం బోలె వార్ధకంబు నాచిబుకింబుకొనుట యుఁ దానంజేసి నే నా తనుగాబ సము త్పన్న వైరాగ్యుండనై. 156

చ. వనమున కేఁగ నెంచి గుణవత్తరుఁడై పిలిపిల్లుచున్న మత్తనయుఁ గుటుంబభారవహనక్రియమించి మదీయ పత్ని నన్ననుగమియింప దానిఁగొనియయ్యయిపుణ్యనదీనదంబులన్ గనుచుఁదపోవనంబులనగంబులునుంగనుఁగొంచు వేడ్కతోన్

క. కాలంజర నామకమై
గ్రాలెడు శైలోత్తమంబు కడ కేఁగి యటన్
గాలంబు పుచ్చుచుండఁగ
నాలో నామిత్రవర్యుఁ డాశబరుండున్. 158

తే. నాయెడం గల్గు కూర్మి నన్ బాయలేక
తన యరణ్య రాజ్యాధిపత్యంబు నెల్ల
విడిచి తానును నావెంట వెడలవచ్చె
నంత మే మెల్లవారము నట్టులుండ. 159

వ. అంతలో నాకుఁ బూర్వజన్మ విద్యాధరత్వంబును, లబ్ధావసానంబైన శంకరశాపంబును స్మృతిగోచరంబు లగుటయు నే నప్పు డదియంతయు నా ప్రియధర్మపత్నియైన మనోవతికిని మదీయపాణిమిత్త్రంబైన శబరాధిపునకును దెలియంబలికి యమ్మానవశరీరంబు విడువందలంచుచు. 160

ఉ. ఎంతయుభక్తితోడఁ బరమేశ్వరు నెమ్మదిఁ బాదుకొల్పి 'యి
క్కాంతయు నీయనుంగుఁ జెలికాఁడును నీడక నాకు వెండి జ
న్మాంతరమందునైన మిటు లర్థికళత్త్రము నా సుమిత్త్రమై
సంతతసౌఖ్యమోదములుసల్పుచు నుందురుగాతమర్త్యలిక! '

చ. అని తలపోసికొంచు సముదగ్రతదున్నతభూధరేంద్రశృం
గనికటభూమినుండి పడి గ్రక్కున మేను దొఱంగితిన్ సుహృ
త్తును సహధర్మచారిణియుఁ దోడన నాక్రియ నాచరించి త
త్తనువులు వీడి నాచనుపథంబున వారును వెంబడింపఁగాన్.

తే. అట్టి యానేనె యోయి సిద్ధాధినాథ
తనయ! యిపుడు జీమూతవాహనుఁ డనంగ
వెలసినాఁడ విద్యాధరకులమునందు
వెండి యిబ్భంగి జాతిస్మరుండ నగుచు. 163

క. ఈవే యాశబరేంద్రుఁడ
వీ వసువున మరలఁ బార్వతీశ్వరకృప మి
త్త్రావసు వనంగ నీవి
శ్వావసు వను సిద్ధపతికి సత్పుత్త్రుఁడవై. 164

తే. తనరుచుంటివి; మిత్త్రిమా! వినుము మఱియు
నమ్మనోవతి నాకు నెయ్యంపు గృహిణి
యదియు నీజన్మమున నిట్టు లుదయమయ్యె
మలయవతి యనుపేర నీచెలియ లగుచు. 165

వ. కావున నివ్విధంబున నీతోడంబుట్టువు నాకుఁ బూర్వజన్మ ధర్మపత్ని యేయై యున్నయది; నీవును నాకుఁ బూర్వజన్మ మిత్త్రుండవై యున్నవాఁడవు; అక్కారణంబున నేనిప్పు డీకన్నియం బెండ్లియాడుట యుక్తంబయై యున్నయది; యది యట్లున్నను నీవు మున్ముందు నాజననీజనకుల కడకరిగి యీ వృత్తాంతంబు వారికి నివేదింపుము; వారిందుల కంగీకరింతు రేని నీయీప్సితంబు తప్పక సిద్ధింపంగలదని యిట్లాజీమూతవాహనుండు పలికిన విని సంప్రీతమనస్కుండై చని మిత్త్రావసుం డది యంతయు నతనితల్లిదండ్రుల కెఱింగించుటయు నంత, వారును దదీయవచనంబు నభినందించి యంగీకరించిరి; రప్పు డమ్మిత్త్రావసుండు మివుల సంతసించుచుఁ దన తలిదండ్రులపాలికిం జని యయ్యర్థంబు వారలకును విన్నవించెఁ దదనంతరంబున:— 166

తే. వారలును నీప్సితవరసంపత్తి కలరి
యనుమతించుటయును, దనయభిమతంబు
సిద్ధిఁ జెందెనటంచుఁ దత్సిద్ధరాజ
పుత్త్రిఁ డెంతయు వేడుక పొందలుకొనఁగ. 167

వ. తనచెలియలి వివాహమహోత్సవంబునకు వలయుసమస్తసం
భారమ్ములును సమకట్టించె; నంత నొక శుభదివసంబున. 168

క. జీమూతవాహనుం డ
త్యామోద మెసంగుచుండ నమ్మలయవతీ
కోమలపాణి యథావిధి
గా మామ యొసంగఁ గొనియెఁ గౌతుక మొప్పన్. 169

వ. ఇవ్విధంబున నజ్జీమూతవాహనుండు మలయవతీ పాణిగ్రహ
ణంబుఁ గావించుటయు నాసమయంబున సిద్ధచారణవిద్యా
ధర గంధర్వాదిసమస్తఖేచరవర్గంబులు నచ్చోటం గూడు
కొని యాడుచుం బాడుచు నత్యంత వైభవంబుగా మహో
త్సవంబుఁ గావించి రంత నిట్లు కృతోద్వాహుండైన జీమూ
తవాహనుం డమ్మలయాచలంబునందు నిజవధూసమేతుండై
సుఖంబుండి పదంపడి యొకానొక దివసంబున. 170

క. బావయు మిత్త్రము నగు మి
త్త్రావసుతో నికట రమ్యతరజలనిధి వే
లావనభాగ విహారే
చ్ఛావశమునఁ జనియె నటకు సంతస మెసఁగన్. 171

సీ. చని, యవ్వనధితీరమున నొక్కచో నొక్క
పురుషుని యౌవనభూషితాంగు
'హాపుత్త్రకా! పుత్త్రకా!' యంచు విలపించు
జనయిత్రి నోదార్చి యనుపువాని

నుద్విగ్న హృదయుఁడై యుండియు సహజధై
ర్యస్థైర్యములు విడనట్టి వాని
ననుయాయి యై వచ్చి యమభటు నట్లు వే
ఱొకఁడు తన్నచ్చోట నున్నయొక్క

తే. పృథు సమున్నతశిలమీఁద విడిచిపోవ
నంతనో యింతనో వచ్చునట్టి మృత్యు
వున కెదురుచూచువానిఁ గన్గొని సుశీఘ్ర
గతి నచటి కేఁగి యిట్లను నతనితోడ. 172

ఉ. ఎవ్వఁడ వీవు? నీజనని యేమిటి కీగతి విహ్వలించుచున్
నెవ్వగఁ జెందె? నేల యిటు నీవును ఖిన్నతఁ జెందియుంటి? నీ
కెవ్విధమైన చేటొదవె? నేమి యొనర్పఁగ నిందు నిల్చితి?
వివ్విషయంబు నాకు వచియింపఁగనౌనె కుమార! నావుడున్.

వ. అతండును జీమూతవాహనునకుఁ దనవృత్తాంతం బిట్లు సెప్పం దొడంగె; నయ్యా! తొల్లి కశ్యపప్రజాపతికిఁ గద్రువయను వినతయనియు నిరువురు భార్యలుండువా; రందాద్యయైన కద్రువ కథాప్రసంగంబున సూర్యాశ్వంబులు శ్యామలవర్ణంబు లనిన రెండవదైన వినత యది యట్లుకా, దవి ధవళవర్ణంబులనియె; నంత నయ్యర్థంబున వార లిరువురు నొండొరులతో వివాదం బొనరించి యన్యోన్యదాస్యంబు పణంబుగా నొడ్డి రయ్యనంతరంబున:— 174

క. విజయార్థిని యై కద్రువ
నిజతనయులఁ బన్నగముల నియమించెన్ వా
రిజమిత్త్రహయాంబుల న
క్కజముగ నసితాంగకములు గా నొనరింపన్. 175

తే. అంతఁ బన్నగు లాయమ యాజ్ఞఁ జేసి
యరిగి నిజవిష ఫూత్కారభరమువలన
మలినములు చేసి రర్కాశ్వములఁ గరంబు
వెల్లనై సాజముగ నుల్లసిల్లువాని. 176

వ. అంత. 177

తే. కద్రువయు నవ్విధమున నాకస్మికముగ
నల్లఁబాఱిన యాదిననాథు తురగ
ములను గాన్పించి కైతవమ్మున జయించి
వినతఁ దనదాసిగాఁ జేసికొనియె నకట! 178

క. ఎఱిఁగియుఁ బంతము విడువరు
పెఱపోలఁతుల యింపు సొంపు పెంపుం గని యో
ర్వరు; కపటములను వెఱవరు
గఱితలు తొల్లింటినుండి; కష్టంబుగదా! 179

వ. అది యట్లుండె నయ్యనంతరంబున. 180

తే. ఆత్మజననికిఁ జేకూఱినట్టిపాటు
వినతకొమరుండు గరుడుండు విని చని బత్తి

మాఱుకొనెఁ గద్రువకుఁ దన మదిని జాలి
పొడమె నిజమాతృదాస్యవిముక్తి పొంటె. 181

వ. పదంపడి యక్కద్రువతనూజు లగు నాగు లెల్లరుం గూడి యాలోచించి యతని కిట్లనిరి. 182

క. ఓ వినతా ప్రియనందన!
దేవత లమృతంబునడఁచియుఁ దివిరి పయఃపా
రావారముఁ ద్రచ్చెద; రటు
గావున నీ వచటి కరిగి కడు వేగమునన్. 183

తే. ఆ సుధం దెచ్చి ప్రీతివస్తు వగు తెఱఁగున
మా కొసఁగి యతని ప్రియమాత దీనిఁ
దోడుకొనిపొమ్ము; నీ వతిదోర్బలంబు
గల్గువాఁడవు నీ కెంత కార్య మిద్ది? 184

క. అని పలికినఁ బన్నగ వ
చనములు విని గరుడి సంభ్రమముగఁ బయోవా
రినిధికడ కరిగి యటఁ దన
యనుపమపౌరుషముఁ జూప నారంభించెన్. 185

ఉ. అంతఁ దదీయ నిస్తుల పరాక్రమభంగికి సంతసించి శ్రీ
కాంతుఁడు విష్ణుదేవుఁడు మొగంబున లే నగవొప్ప నగ్గరు
త్మంతుని జూచి యోభువనమాన్యపరాక్రమ! నీదు విక్రమా
క్రాంతికి మెచ్చితిన్ వర మొకండు వరింపుము;నీకొసంగెదన్.

ఉ. నాపుడు మాతృదాస్యపరిణద్ధ వివృద్ధరుషా సముత్థప
ద్భావుఁడు పక్షివల్లభుఁడు ప్రాంజలియై వినయంబుతోడ నో
దేవర! కాద్రవేయులు మదీయవిరోధులు నాగు; లయ్యన
ద్భావులు నాకు నిత్యమును భక్ష్యములుగా నరమీఁగదే కృపన్

వ. అని ప్రార్థించె; నంత నమ్మహావిష్ణుఁడును ప్రసన్నచిత్తుండై యట్ల యగుంగావుత మని యనుగ్రహించెఁ బదంపడి యవ్వైనతేయుండు తనవీర్యాతిరేకంబున నాదితేయుల నెల్లర నిర్జించి నిజభుజార్జితం బైన యమృతభాండంబుం గొని పఱవం దొడఁగుటయు నంత విదితవృత్తాంతుం డైన శక్రుం డతని సన్నిధి కరిగి. 188

క. విహగేంద్ర! దుష్టులగు స
ర్పావళులకు నీయమృత మీయ నగునయ్య! కృపా
మహితాత్మ! భవత్కృతి ని
ర్వహణమునకై నది యవశ్యముఁ గొనుమీ! 189

వ. తత్కార్య నిర్వహణానంతరంబున:— 190

ఆ.వె. పన్నగములనోటఁ బడకుండ నెండియు
నేను దీని సంగ్రహింప నేర్చు
నట్లనుగ్రహింపు; మాదితేయుల యెడఁ
గరుణసేయు ముచితకార్యదక్ష! 191

క. అనవుఁడు నది విని వినతా
తనయుం డట్లే యటంచుఁ దదమృతకలశం

బును గొని నాగులపాలికిఁ
జని విష్ణువరప్రసాద సంపన్నుండై. 193

వ. ఇట్లు చని హరివరప్రభావభీతాత్మకులును ముగ్ధులునై యున్న యప్పన్నగులు తన్నుంగని వెఱచఱచి పఱవం బోవ వారలఁ దఱియం బోవక గరుడుం డిట్లనియె. 193

క. ఇది యమృతముఁ గొని వచ్చితి
ముదమున మాజనని దాస్యముం దొలఁచి దురా
సదమగు దీనిం గొనుఁ డటు
లదవదపడనేల నిలువుఁ డహివరులారా! 194

తే. వినుఁడు ననుఁ దఱియఁగ మీకు వెఱపయేని
దీని సుపవిత్ర దర్భలపై నిడియెద
నిచట; మాజననిం గొని యే నరిగిన
వెనుకఁ జనుదెంచి యీసుధం గొనుఁడు మీరు. 195

ఆ.వె. అని వచింప నాగు లందుల కొడఁబడి
రంత వైనతేయుఁ డమృతకలశ
మచట దర్భసంస్తరాంతరంబున నిల్పి
విడిచి పుచ్చి రహులు వినత నపుడు. 196

క. ఈగతి జననీదాస్యము
నీఁగి కృతార్థుఁ డయి గరుడుఁ డేఁగ గతభయో
ద్వేగు లయి నాగు లమృతము
భాగించి భుజింప నానపడి చనులోనన్. 197

వాసుకి యేలిక నుపేక్షించిన సమస్తనాగలోకంబు నొక్క-
మాఱు నశించునని యును నమున విరోధియగు పన్నగేశ్వరుండు
మహావీర దోర్బలసమేతుం డనియును జూచి తత్తఱంబ
యు వైనతేయుని బ్రార్థించి యతనితో నిబ్బంధంబున నొక్క-
నమయంబుఁ గావించుకొనియె; నది యెట్టిదనిన:— 201

క. దినదినము నొక్క-నాగునిఁ
బనిచెదఁ బక్షీంద్ర! నీకు భక్ష్యంబుగ న
వ్వననిధి పులినస్థలిఁ గల
ఘనతరశైల కడకుఁ దప్పక యథార్థముగాన. 202

క. పాతాళభువనమున కీ
వీ తెఱఁగునఁ బ్రతిదినంబు నేమిటికి మహా
పాతకంబుగ రా, భుజగ
వ్రాత మ్మిబ్భంగి భీతివడి నశియింపన్? 203

వ. ఈనాగకులం బంతయు నిట్లొక్క పెట్టున నెట్టె యుచిరకా
లంబునందె నక్షయంబు నొందుటవలన నీకు స్వార్థంబునుం
జెడిపోవుఁగాదె? యని యిట్లు వాసుకి సముచితప్రకారంబున
వచియించిన విని వల్లెయని గరుడుండు ప్రత్యహంబును దచ్చేర్చి
పెత్తుం డైన యొక్కొక్క-నాగునిం గ్రమంబుగ భుజింప
నుపక్రమించె; నీ క్రమంబున నిచ్చట నసంఖ్యాకంబైన
ఫణిలోకంబు నక్షయంబు నొందె; నేనును శంఖచూడుం
డను పేరం బరఁగు నొక్క- నాగకుమారుండ; నదీర్ఘాయు

ష్యుండ నగుటంజేసి నేఁడు నావంతు వచ్చెం; గావున గరుడున కాహారం బగుపొంటె నాగరాజునిదేశంబున నేనీ వధ్యశిల నధిష్ఠింపవలసిన వాఁడ నైతి; నిట్లె నన్నుం గనుం గొని పుత్త్రవాత్సల్యాతిశయంబున మాతల్లియు నవ్విధం బున శోకింపవలసి వచ్చె; నని యిట్లు శంఖచూడుండు చెప్పిన విని. 204

తే. వగపు నిగుడఁగ జీమూతవాహనుండు
కటకటం బడి యాపన్నగసుకుమారు
భవ్యసుమనోజ్ఞ కారుణ్యభానమాను
శంఖచూడునిఁ గనుఁగొని జాలి నొంది. 205

వ. అతని కిట్లనియె. 206

మ. అకటా! యెంత యశక్తుఁడో ఫణికులాధ్యక్షత్వముం గన్న వాసుకి? నిత్యంబుఁ దనంతఁ దానిటు పరిజాక్షోభంబుగాఁ దద్వైరోధికి భుక్త్యర్థమువుచ్చునే ప్రజలఁ జింతింపంగ నీపాటిర క్షకుఁ డా నేఁటికిఁ బూనఁగావలయు రాజత్వంబు సర్పాళికిన్?

క. దక్షుండగు నేడ శత్రుల
శిక్షింపఁగ వలయుఁ, బ్రజలు చేడ్పడకుండన్
రక్షింప వలయుఁ గా కిటు
భక్షింపఁగఁ బుత్తురే విపక్షుల కకటా! 208

క. తన్నేల తొలుత గరుడున
కన్నముగా నీయఁడయ్యె? ననసమర్థుండై

కన్నార నిల్లు కనుఁగొను
చున్నే నన్యాంకుఱుఁబు నురగేంద్రుఁడ దహా! 209

వ. ఇదియు నిట్లుండ. 210

చ. కృతమతియైన యచ్యుతునకిన్ మహితాత్ముఁడు కశ్యప
ప్రజాపతికిని బుత్త్రుఁడై పొడమి పక్షివిభుం డలఁడేల యిట్టి
దుష్కృతికిఁ గడంగెఁ బొట్టకయి? కేవలమున్ మహనీయు
లైన పవిత్రులకు నైన మెంతటి ఘనంబగు మోహమో
చింతసేయఁగన్! 211

వ. అయిన నగుంగాక. 212

ఆ.వె. నేఁటి కొఱకని నైన నిను నేను రక్షింతుఁ
బక్షివల్లభునకుఁ బారణముగ
నాశరీర మొసఁగి నాగకుమార! మి
త్త్రము! విషాద ముడుగు! మనుమినాత్మ! 213

వ. అనిన నది విని శంఖచూడుండును ధైర్యాతిశయంబు నవ
లంబించి యాజీమూతవాహనున కిట్లనియె. 214

తే. వలదు వలదు! మహాసత్త్వ! పలుకఁ బోకు
మిట్లు వెండియు; నిది నే సహింపఁజాలఁ
గాచఖండంబునకు మాణిక్యమణిఁ గోలు
పోవ నుచితంబుగా దొకప్పుడును వినుము! 215

తే. నశ్వరంబైన పాత్రింబున కిపు డిట్లు
నెఱచి మహాత్మ! నిను బలివెట్టి వెడలఁ

గులము వారెల్ల నే మనుకొందురొ నన్నుఁ?
గలుగదే తిరమగు కళంకంబు నాకు? 216

క. కుల మెల్లఁ జెడెడు తఱి నా
కుల మతి నే నొక్కరుండఁ గొంకుచు జీవ
మ్ముల నిలువఁ బెట్టుకొని యా
వల నెన్నాళ్లనుభవింపవచ్చు సుఖంబుల్? 217

వ. కావున నీవు నాయెడల దయాళుండవై నన్ను రక్షింప వలయు
నని చెప్పి సాధుచిత్తుండైన శంఖచూడుం డా జీమూత
వాహనుని వారించి యింక నొక్క క్షణకాలంబునకు గరు
డుండు సనుదెంచు వేళ యగు నని తలంచి యీలోపలఁ
దద్వార్ధితీరవర్తి యగు గోకర్ణేశ్వరుం దన యంత్యకాలంబు
నం దొక్కపరి మ్రొక్కి చనుదేర నరిగె; నంత నతం డ
ట్లరుగం జూచి కారుణ్యనిధానం బైన యా జీమూతవాహనుండు
తా నాత్మార్పణంబుఁ గావించి యతనిం గాపాడ నవకా
శంబు చేకూరె నని యెఱింగి తన మనంబున సంతసించుచు
స్వయుక్తి విశేషంబున నవ్వృత్తాంతం బంతయు నతి శీఘ్రం
బుగఁ దన బావ మిత్రావసుండు మఱపుఁ గొనం జేసి
కార్యాంతరాపదేశంబున నతని నింటి కనిచెఁ; బదంపడి యు
య్యుత్త రక్షణంబునంద. 218

చ. వడిఁ బఱతెంచినచ్చు ఖగవల్లభు పక్ష సముత్థవాయువుల్
సుడిగొనఁ దత్సుసత్త్వమును జూచిన యచ్చెరుపాటునం బలెన్

చ. వడిఁ బఱతెంచి వచ్చి ఖగవల్లభుపక్షసముత్థవాయువుల్
నుడిగొనఁ దత్సనత్త్వమును జూచినయచ్చెరుపాటునం బలెన్
బుడమియుఘూర్ణిలం దొడఁగె భూరితరధ్వనియుప్పతిల్లె న
ల్గడలను; దాని సంతతియును గన్గొని నిర్గతసంశయాత్ముఁడై.

తే. ఉరగలోకాంతకుఁడు వచ్చుచుండు టెఱిఁగి
పరజనార్త్యనుకంపి నిర్భయ నిరూఢ
భావకలితుఁ డాజీమూతవాహనుండు
తత్క్షణమ యేఁగి నిల్చె వధ్యశిలమీఁద. 220

వ. అంతఁ దమ త్తరక్షణంబునందు గరుడుండు స్వచ్ఛాయాచ్ఛాదిత నభోమండలుండై చనుదెంచి యయ్యెడ వార్ధి నిజతీక్ష్ణతర చంచూపుటంబున సమ్మహాసత్త్వుఁ గఱచి పట్టుకొని. 221

క. తొరఁగెడు నెత్తురు ధగధ్ధై
వరుసగ నెడతెగక జాలువాఱన్, దెగి త
చ్ఛిరమునఁ గల చూడామణి
దొరలి పుడమిఁ బడఁగ నతనిఁ దోడ్కొని పఱచెన్. 222

వ. ఇట్లు పఱచి యతని సమ్మలయగిరి శిఖరంబునం బెట్టుకొని గరుడుండు తనతీక్ష్ణతుండంబునం బొడిచికొని తినఁదొడంగ; నాసమయంబున నభస్స్థలంబునుండి యనుపమానంబైన యొక్కప్రసూనవర్షంబు వర్షించె; నప్పు డప్పూలవానం గనుంగొని తార్క్ష్యుం డిది యేమి యని విస్మయభ్రాంతుం డగుచుండె; నంతలో నచ్చట నాశంఖచూడుండును గోకర్ణ

శ్వరుం దన మిత్రరలోకసుఖావాప్తిగా సర్పించి వచ్చి రుధిరా
సార నంసిక్తం జేయున్న యావధ్య శిలాతలంబు నవలోకించి.

తే. అక్కటా! మన్నిమిత్తమై యమ్మహాత్ముఁ
డప్పతంగేశ్వరునకుఁ దన్నర్పణంబు
చేసికొని ధన్యతముఁ డయ్యెఁ; జే! మదీయ
జీవితం బిది వ్యర్థమై చెడియెఁగాదె? 224

వ. ఈస్వల్పకాలంబునం దార్క్ష్యుం డాతని నెచ్చటికిఁ గొని పోయి
యుండు? నొకవేళ నతం డీప్రాంతంబునఁ జిక్కనం జిక్క
వచ్చు; నన్వేషించెదంగాక యని యతిత్వరితంబుగఁ దద్రక్త
ధార ననుసరించి యరిగె; నీలోపల నక్కడ నజ్జీమూతవా
హనుండు. 225

క. నాగులక పోగులక మదిలో
దిగులొందక గరుడి పొడిచి తినుచున్నను నె
మ్మొగమునఁ బ్రహర్షభావం
బిగురొత్తం గూరుచుండ నీక్షించి వెనన్. 226

ఆ.వె. పక్షివిభుఁడు వెఱఁగు పడి యమ్మహాసత్త్వ
శాలిఁ దినుట మాని సంశయంబు
గదుర నెమ్మనమునఁ గుదురుగా నిబ్భంగిఁ
దలఁపఁ జొచ్చె మనసు కలఁత నొంద. 227

ఉ. నాగుఁడుగాఁ డితం డరసినన్ దృఢనిశ్చయుఁడెవ్వఁడో మహా
భాగుఁడుగాని, మున్ దినిన పన్నగు లెవ్వరు నింత నిర్గతో

ద్వేగత నిల్వ రైరి నిజవిప్లవకాలమునందు నీతఁ డీ
లాగయి యున్నవాఁ డవికలస్థితి నేమి విచిత్రమో గదా ?

వ. అని యిట్లు తన యంతర్గతంబున విమర్శించుచున్న యాగరు
త్మంతుం గనుంగొని జీమూతవాహనుండు తానట్టి కష్టస్థితి
యందుండియు నిజాభీష్టంబు నెఱవేఱుపోంజెలు నతనితో నిట్ల
నియె. 229

తే. ఖగకులాధీశ ! నామేనఁ గలవు మాంస
శోణితము లింకనున్ రసశోభితములు
నీ వతృప్తుండ వయ్యు మానితి వి దేల
కుడువ కాకస్మికముగ నిమ్ముడ? మహాత్మ ! 230

క. ఈమాంసము నీనెత్తురు
నీమానస తృప్తిపొంచె నిష్టము; లో
స్వామీ ! సంశయపడ నే
లా? మెసవుము కడుపు నిండున ట్లివి యెల్లన్. 231

వ. అనిన నది విని సుపత్త్రిరాజు మహాశ్చర్య వశగుండై యా
జీమూతవాహనుం గనుంగొని యిట్లనియె. 232

తే. గుణవదుత్తమ ! నీవు నాగుని విధముఁ
గానగాకుంటి వెవఁడవో గాని, నాకుఁ
దెలియఁ జెప్పుము వేగ నీకులతెఱంగు
నంత దనుకను నిన్ను నే నంట నింక! 233

ఉ. నావుడు జాలమేల? ఖగనాయక! నాగుఁడనే; భుజింపు; స
ద్భావముతోడఁ దొల్త ననుఁ బట్టి భుజింపఁగఁబూనినాఁడ; వి
ట్లీవిపుడప్పునిన్ విడువ నేఁటికిఁ? బూనినకార్య, మార్యు,లా
హా! విడువం దలంతురె సమాప్తముసేయకసంశయాత్మతన్?

తే. అనుచు జీమూతవాహనుం డాఖగేంద్రు
తోడ నిబ్భంగి సుచితోక్తు లాడుచుండ
నంతలో శంఖచూడుఁ డాచెంత కరిగి
దవ్వులన యుండి వారి నిద్దఱను గాంచి. 235

క. రిత్తగ నీయుత్తమ జనుఁ
డిత్తెఱఁగునఁ గూలియు చుండెనే? యనుచుఁ గడుం
దత్తఱము దోఁపఁ జేరెలుఁ
గెత్తి విహంగేశుతోడ నిట్లని పలికెన్. 236

తే. అతఁడు నాగుఁడు గాఁడు విహంగనాథ!
వలదు వలదు భుజింపఁగా వలవ దతని;
నాగుఁడను నేను వచ్చుచున్నాఁడ నిదిగోఁ
దినుము నను నీవు నీతృప్తి దీఱునట్లు! 237

క. కనుఁగొనవైతివి కశ్యప
తనయా! నీవింత భ్రాంతిఁ దవిలితి వేలా?
యనఘాత్ము నితనిఁ బన్నగుఁ
డని భ్రమసితివో? యుక్తమా? యుడుగు మిఁకన్! 238

వ. అని యివ్విధంబున నాశంఖచూడుం డాక్రోశింపఁ దొడంగిన నది విని యాఖగేశ్వరుండు మిగుల విభ్రాంతుండై యుండుటయు నంత జీమూతవాహనుండును దనవాంఛితార్థంబు నెఱవేఱదయ్యె నని ఖేదింపం దొడంగెఁ; బదంపడి యన్యోన్యసమాలాపక్రమంబున గరుత్మంతుం డతని విద్యాధరాధీశుం డైన జీమూతవాహనుం డని యెఱింగి యజ్ఞానవశంబునఁ దానట్టి మహాసీయు భక్షించి నందుల కులతియు వగచుచుఁ దనమనంబున నిట్లు పరితపింపం దొడంగె. 239

తే. అక్కటా ! యే నృశంసుండనై యనల్ప
ఘోరదుష్కృతి కొడిగట్టుకొంటి నిట్లు;
వగవ నేమిటి కిన్నార్గవర్తనులకుఁ
బాప మొదవుట యది సులభంబు కాదె ? 240

ఆ.వె. పరునికొఱకుఁ దనదుప్రాణ మర్పించిన
ఘనుఁ డితం డొకండ కాఁడె ? ధన్యు
తముఁడు, వినుతిసేయఁ దగువాఁడు, సత్పుణ్య
ఫలము ననుభవింపవలయువాఁడు! 241

క. నా దను నజ్ఞానంబున
నేదియుఁ గావింపనేర కెప్పుడు నఘనం
పాదనము సేయు విశ్వము
నీదమితేంద్రియుఁ డధఃకరించం గాదే ? 242

వ. అని యిట్లనేకవిధంబులం బలికిచి గరుత్మంతుం డత్యంత

పశ్చాత్తాపసంతప్తుండై యాత్మపాప శుద్ధిపొంటె నగ్నిప్రవే
శంబు సేయ నుంకించుటయు నంత నజ్జీమూతవాహనుం డతి
నిం గనుంగొని. 243

క. ఉడుగుము పక్షీశ్వర ! వెత
గుడుచుచు నీవిట్టి పనులకున్ గడఁగకు మి
య్యెడ నిజముగఁ బాపమ్మున
కడలు వొడమెనేని చెప్పు నది వినఁగదవే ! 244

వ. అది యెద్ది యనిన ? 245

క. మరల నిఁకెన్నడు నీ వి
ట్లురగముల భుజింపఁదలఁపకుండుము; మదిలోఁ
గర మనుతాపముఁ గొను మీ
వరికి నీన్ని తినిన నాగసంతతి కనఘా ! 246

వ. ఇదియ నీచేసినపాపంబునకుఁ బ్రతీకారంబు; పాపాత్ములైన
వారు తాము చేయు పాపకృత్యంబులు నుడిగి మున్ను చేసి
యున్న పాపంబులకుఁ బశ్చాత్తాపంబుఁ గొనుటయె తత్పాప
పరిహారంబునకుఁ బరమప్రతిక్రియ యని మునులవలన వినం
బడుఁ; గావున నీ వట్లొనర్పు; మొండొక్క తలంపు సేయుట
వ్యర్థం; బని యిట్లు సర్వభూతానుకంపియైన యజ్జీమూత
వాహనుండు వలికిన విని యాతార్క్ష్యుండు మహాత్మా! యట్ల
సేయువాఁడ నని యవ్వాక్యంబులు గురువచనంబులుంబోలెఁ
బరిగ్రహించి. 247

గీ. అరిగె నాకపురంబున కతిజవమున
నమృతముం గొని తెచ్చి క్షతాంగు నతని
నష్టశేషులై మిగిలిన యన్యభుజగ
వరుల నెండియు బ్రతికించు వాంఛఁ జేసి. 248

సీ. అంత జీమూతవాహనసతీ సద్భక్తి
సంతుష్టయైన యాశంభురాణి
గౌరీమహాదేవి కరుణ సాక్షాత్కార
మొనరించి యమృతధారోక్షణమున
జీమూతవాహను సంసిక్తుఁ జేసెను; దాన
నధికతరోద్భాత మైనకాంతి
వెలయఁ దదంగముల్ విలసిల్లె సానంద
దైవత దుందుభి ధ్వనులతోడ

గీ. నతఁడు స్వస్థాత్ముఁ డయ్యె; నంతలోన
వైనతేయుండు సుధఁ గొని వచ్చి యభ్ర
మండలమునుండి వర్షించె మహిఁ దదబ్ధి
తటమునం దెల్లపట్టులుఁ దడియునట్లు. 249

వ. అయ్యమృతవర్షంబున సమస్త పన్నగులును బునర్జీవితులై లేచి; రప్పు డవ్వేలావనం బంతయు భూరిభుజంగసంకులం బును, వినిర్ముక్త వైనతేయభయంబు నై జీమూతవాహనా లోకనార్థంబు చనుదెంచిన పాతాళలోకంబు చందంబున విరాజిల్లె; నట్టియెడ:— 250

గీ. అక్షయంబైన దేహంబు నట్టి యశముఁ
గని తనర్చు జీమూతవాహనునుదంత
మది సమస్తమ్ము నెఱిఁగి తదాప్తబంధు
గణ మతని నభినందించెఁ గడుముదమున. 251

ఆ. మఱియు, నతని కూర్మిమహిషియుఁ దలిదండ్రు
లును బ్రహృష్టభావమును వహించి;
రవని దుఃఖసముదయము సుఖపరివృత్తిఁ
జెంద నెవరు మోద మందకుండ్రు? 252

వ. పదంపడి శంఖచూడుండును జీమూతవాహన విసృష్టుండై యభీష్టంబుగా రసాతలంబున కరిగె; జీమూతవాహనుని యశోవిభవంబు లోకత్రయీవిస్తృష్టంబై వెలుంగఁదొడంగె.

సీ. అంతఁ బ్రీతిప్రహృష్టులై సురల్ గరుడునిఁ
బ్రణుతించి మ్రొక్కిరి బహువిధముల
జీమూతవాహనుఁ జిరము విద్వేషించి
యపకృతుల్ సేయు దాయాదు లెల్ల
హైమవతీ సత్కృపాతిశయంబున
నభయులై యాతని సవిధమునకుఁ
జనుదెంచి తొల్లింటి సరణిఁ బదాధిప
త్యముఁ బూన నర్థించి రాదరమున

గీ. నపుడు మలయగిరినుండి నిజాలయ మగు
హిమమహీధరతటమున కేఁగెఁ దల్లి

దండ్రులను మలయవతిని దనదు ప్రాణ
సఖుని మిత్రావసునిఁ గొని సంతసమున. 254

వ. ఇవ్విధంబున జీమూతవాహనుండు మరల నిజావాసంబున
కేఁగి యథాపూర్వంబుగాఁ దన విద్యాధరచక్రవర్తిపదంబు
వడసి చిరకాల మభీష్టభోగంబు లనుభవించె. 255

గీ. ఇట్లు సకల జగజ్జన హృచ్చమత్కా-
రకర మనోజ్ఞతర చరిత్రములు గలిగి
వఱలు వారిని శుభపరంపరలు విడక
యనుసరించు సతంబుఁ దమంతఁ దామ. 256

గీ. అనుచు నిట్లు యౌగంధరాయణుఁడు సెప్ప
ధరణీధవపత్ని వాసవదత్త పూర్ణ
గర్భభరదోహదోదార కడు ముదంబుఁ
గాంచి పదపడి పతిసముఖమ్ముఁ జేరి. 257

గీ. భావి విద్యాధరేశ్వర స్వతనుజాత
కథలు తన కిష్టదైవతగణము స్వప్న
సముదయమునఁ బ్రసన్నభావమునఁ దెలుపఁ
గడపె నారాత్రి కడుఁ గౌతుకమ్ము మీఱ. 258

లావాణకలంబకమున

ద్వితీయతరంగము

సమాప్తము.

ఓమ్ !

# ఆంధ్ర
# కథాసరిత్సాగరము.

## నరవాహనదత్త జననలంబకము.

———:o:———

### తృతీయ తరంగము

గీ. అవల నొకనాఁడు విజనమ్మునందు సచివ
యుక్తుఁడై వత్సపతి తనయొద్ద నున్న
తఱి మహారాజ్ఞి వాసవదత్త యతని
కిట్టులనె సిగ్గొకించుక నెట్టికొనఁగ.

గీ. ప్రాణనాయక ! యేనుగర్భము ధరించి
నది మొదలు నాకుఁ దద్రక్షకై సతంబు
హృదయ ముత్తలపడుచుండు నెంతయేని
మెఱుఁగఁ దత్కారణం బది యేమొకాని. 2

సీ. అది యట్టు లుండ, నే నాచింతతో నెట్లొ
నిద్దురఁ జెందితి నేఁటిరాత్రి
యంత స్వప్నమున భస్మాంగరాగసితాంగుఁ
డురుశూల కలిత హస్తోజ్జ్వలుండు

శేఖరీకృతచంద్రరేఖాభిశోభిత
కపిలజటాబద్ధ ఘనశిరస్కుఁ
డభినవవ్యాఘ్రచర్మాంబరవసనుండు
సత్కృపాలోకపరిసన్నముఖుఁడు

గీ. నైన యొక దివ్యపూరుషుం డర్థి నాదు
కన్నుదోయికి నెదుట సాక్షాత్కరించి
యల్లనల్లన నాచెంత కరుగుదెంచి
యిట్టు లనియెఁ గృపారసంబుట్టిపడఁగ. 3

వ. పుత్రికా! నీవు భవదీయగర్భరక్షణావిషయంబున నేమియుం జింత గొనకుము. నేనకాదె నీగర్భంబు ననుగ్రహించి యున్నవాఁడఁ? గావున దానిని నేన సంరక్షించుచుండం గలవాఁడ, నిందులకు సందియ మందకుము; నీకుఁ బ్రత్యయంబు గలుగుపొంటె నొక్కనిదర్శనంబు సెప్పుచున్నవాఁడ:— 4

సీ. విను మిది; రేపు నీవిభుసమక్షంబున
కొక నాతి, తనభర్త నొడిసిపట్టి
కొనివచ్చుఁ దద్దోషమును విన్నవింపంగ;
నది దుష్టశీల; పాపాత్మురాలు;
నిజబంధుజనముల నిర్బంధమునఁ జేసి
పతిమీఁద దోసఁగులు పన్ని చెప్పి
వాని నెల్లెడియు వధ్యుఁగాఁ జేయింప
నిచ్చగించినదాట నేవి యేమొ

గీ. కల్ల నొడువులు పల్కు నొక్కటియు నందు
సత్య మనుకొనరాదు వత్సా! నిజంబు
దెలియఁదగు వత్సపతి కిది తేటపడఁగ
నెఱుక పఱుపుము మున్ముందె మఱపుగొనక. 5

క. సాధుమతియైన తత్పతి
భూధవుచే దండనమ్ముఁ బొందక, యాదు
ర్మేధ కెడఁదొలఁగి యపగత
బాధుండై బ్రతుకునట్లు పరికింపఁ దగున్. 6

వ. అని యిట్లాదేశించి యమ్మహాత్ముం డంతర్ధానంబు నొందు
టయుఁ దోడన నేనును మేలుకొంటి; నంత, రాత్రియుఁ
దెల్లవాఱె; నని యవ్వాసవదత్తాదేవి యిట్లు పలికిన విని
యచ్చటి వారందఱును విస్మితమనస్కులై యిది యంతయు
సర్వేశ్వరుండైన యీశ్వరుని యనుగ్రహంబ యని తలం
చుచుఁ దత్సంవాదాపేక్షాసక్తహృదయులై యుండిరి; తత్క్ష
ణంబ ప్రతీహారముఖ్యుం డాకస్మికంబుగాఁ జనుదెంచి యా
త్మానుకంపియైన యవ్వత్సేశ్వరున కిట్లని విన్నవించె. 7

గీ. ప్రభువరా! యెవ్వతో యొక్కపడఁతి బంధు
జన పరీవృతయై తనతనయు లేవు
రనుగమింపఁగ, వివశుఁడైనట్టి భర్తఁ
గొనుచుఁ జనుదెంచె నేదియో మనవిసేయ. 8

చ. అనవిని వత్సరాజు హృదయంబున విస్మయమంది, దేవి చె
ప్పినకలలోనివార్త యది వెంటనె యీగతిఁ దారకాణమై
కనఁబడవచ్చెఁ; జిత్ర మిదిగాదెయటంచుఁదలంచి,ద్వారపా
లుని గని వారి నెల్లరను లోనికిఁదోడ్కొనిరమ్మనె;నానృపుఁడున్.

వ. మహాప్రసాదంబని ప్రతీహారుండు వెడలె; వాసవదత్తాదేవియు నిజస్వప్న సత్యత్వ సంజాత సత్పుత్త్రప్రాప్తి సంపూర్ణ నిశ్చయయై పరమానందంబు నొందుచుండె; నంత, నచ్చటివార లెల్లరు ద్వారదేశోన్ముఖులై యత్యంతకౌతుకంబునం గనుంగొనుచుండఁ, బ్రతీహారాజ్ఞానుసారంబుగా నవ్వనిత తనమగనితో రాజసన్నిధిఁ బ్రవేశించి యతిదైన్యంబు వెల్లడించుచు యథాక్రమంబుగ దేవీసహితుండైయున్న యన్నరేంద్రునకు నమస్కరించి యిట్లనియె. 10

ఆ. నరవరేణ్య! నేను నిరపరాధ; నితండు
నాకు భర్త యయ్యు నన్నొకప్పుఁ
గనుఁగొనండు; కావునఁ గట్ట నేమియు నీఁడు
దేవ! నాకు వేఱు దిక్కు లేదు. 11

క. దీనానాథజనంబుల
భూనాథుఁడ వీవకాక ప్రోవఁగ నిఁక నే
మానవులు శక్తులగుదురు?
దీనిని ధర్మజ్ఞ! నీకుఁ దెలుపవలయునే? 12

క. అని యది యటు విజ్ఞాపన
మొనరింపఁగ, దాని భర్తయును "దేవా! నా
మనవిన్ విను మిపు డిది సె
ప్పిన దంతయు వట్టి కల్ల పేరువుడు ప్రభూ! 13

ఆ. ఏఁటి కేఁడాదికిని జాలుపాటికొలుచు
నువ్వు పప్పులు సకలమ్ము నొక్కమాఱె
ముందుగాఁ దెచ్చి యిచ్చితి నిందొకింత
యేని యన్నృతము లేదు భూమిపాల! వినుము. 14

క. తనచుట్టంబులుఁ దానును
ననుఁ గడతేర్పింపఁ దలఁచి నరనాయక! ప
న్నిన యన్నృతకల్పనము లివి
గనుఁగొను; మిదె సాక్షిజనులు గల రివ్వోటన్. 15

వ. ఆసాక్షులును దీనిబాంధవులె యయ్యును దటస్థు లగుటం జేసి యసత్యంబు వలుక నొల్లరని విన్నవింప నది విని వత్సేశ్వరుం డింక నియ్యెడ నన్యసాక్షి జనంబులతో నేమి పని గలదు? దేవీస్వప్నంబున నీశ్వరుండె సాక్ష్యం బొసంగియున్న వాఁడు గాదె? యీమురాత్మురాలిని సబాంధవంబుగా నిగ్రహింపం దగు నని యానతిచ్చుటయు నంత యౌగంధరాయణుం డాతని నుద్దేశించి "దేవా! యేది యెట్లయినను సాక్షి వచనంబులవలననే యథోచితంబుగా నొనరించుట యుక్తంబు. సాధారణలోకంబునకు దేవీ స్వప్నవృత్తాంతప్రత్య

యుంబు లేకుండం బోవచ్చుం; గావున సాక్షివిచారణంబు
గావింపం దగు నని పలికిన నట్ల యగుం గాక యని వత్సే
శ్వరుండు తత్క్షణంబ సాక్షుల రప్పించి యడుగుటయు వార
లందఱు నన్వనిత మిథ్యావాదిని యని వచియించి; రాసమ
యంబున:— 16

చ. పతి కహితంబుగా ననృతభాషణముల్ వచియించి వాని దూ
షితు నొనరింప నెంచె గుణశీలవివర్జిత గాన దీనిపిన్
సుతులను బంధువర్గమును జోరులఁ ద్రోలినభంగిఁ ద్రోలుఁడీ
క్షితి వెడలంగ నంచు నృపశేఖరుఁ డానతివెట్టె నంతలోన్.

ఆ. ప్రభునియాజ్ఞ రాజభటులు తద్దేశంబు
వాపి దానిఁ బుత్త్రబంధువర్గ
సహితముగ సుదూరజనపదమున కన్పి
రపుడు వత్సనృపతి కృపదలిర్ప. 18

గీ. దానిభర్తకు వేఱొకతరుణిఁ బెండ్లి
యాడుటకుఁ జాలు విత్త మీయఁగ ననుజ్ఞ
నెట్టి పంపించె; వాఁడు నవ్విత్తముఁ గొని
చనియె నృపతికి మ్రొక్కిడి నంతనమున. 19

వ. అంత. 20

గీ. "దుర్దశావటమునఁ గూలి తూలుచుండు
పురుషు బ్రోతికియుండఁగని, దుర్బుద్ధియైన

క్రూరదేహిని పట్టి పీఁకుకొని తినదె?
కాకివిధమునఁ గడుఁ బలుగాకి యగుచు. 21

గీ. "తాపహారిణియై మహత్త్వంబు గలిగి
నిత్యసుస్నిగ్ధ యగు గృహిణి యది మార్గ
సంస్థితం బగు ఘనతరుచ్ఛాయవోలెఁ
బడయ నగుఁ గొందఱికిఁ బుణ్యవశమువలన." 22

వ. అని యిట్లు వత్సేశ్వరుండు తత్ప్రసంగవశంబున వచియించు చుండఁ దత్పార్శ్వంబున నున్న వివిధ కథాకథన పటిష్ఠుండగు వసంతకుఁ డాతేని నుద్దేశించి మఱియు నోదేవా! యీ లోకంబున శరీరధారుల కెల్లరకును విరోధంబుగాని, స్నేహంబుగాని ప్రాయికంబుగాఁ బ్రాగ్జన్మ వాసనావశంబునం గలుగుచుండు; నిందులకు నేఁ జెప్పంబోవు నిక్కథ నవధరింపుము.

—♦ సింహపరాక్రమునికథ. ♦—

సీ. వారాణసీ పురీవరమున విక్రమ
చండుఁ డన రాజొకఁడుండుఁ దొల్లి
యతనికి సింహపరాక్రముఁ డను పేరఁ
బరఁగుచుఁ గడుఁ బ్రీతిపాత్రమైన
భృత్యుం డొకం డొప్పు నత్యంత శూరుండు
వాఁడు బాహుబలంబువలన నాహ
వములందుఁబలె బుద్ధిబలమున జూదంబు
లందు నిత్యమ్ము గెల్పొందుచుండు

గీ. వాని కొక్క వికృతాకార వైభవయును
బహుళ విరుద్ధశరాశయు భార్య యయ్యెఁ
గలహకారిణి యనఁగ విఖ్యాత సార్థ
కాభిధానంబు గలిగి, యేమందు నధిప ! 24

వ. సింహపరాక్రముండును రాకాసింబోలి గయ్యాళియైన య
య్యాలితో నాకాశీయం దట్లు రాజానుగ్రహంబు గలిగి
వర్తించుచు. 25

క. ద్యూతమువలనను నిజభూ
నేతవలనఁ బడయుచుండు నిఖిలధనముఁ దా
నేతఱి కాతఱిఁ బెండ్లము
చేతన యిడుచుండుఁ దద్వశీకృతిఁ బడయన్. 26

క. అతఁ డట్టు లెంత యిచ్చిన
మతిఁ దృప్తివహింపఁబోదు; మఱియును, దత్సం
గతి ముగురుసుతులఁ బడసియుఁ
బతితోఁ గలహించు సతముఁ బరుషవచనయై. 27

వ. ఇదియునుంగాక. 28

ఉ. ఏఁగెద వెప్పుడున్ బయటి; కెయ్యెదొ యెందొ భుజింతు;
వేగిరయో! త్రాగుదు; వాలి బిడ్డలకతల్ దలపోయవు; విత్త
మీయ; వేలాగునఁ గాపురంబిది నిలంబడు? నంచుఁ గటూ
క్తులాడుచున్! వాఁగెడునోర దెప్పుడును వాఁగుచు నుండఁగ
నేఁచుఁ దత్పతిన్. 29

ఉ. మంచితనంబుగాఁ దగినమాటలు సెప్పుచు నన్నవస్త్రముల్
గొంచెపడంగనీక తగుకూరిమి సూపుచు భర్త యెంత లా
లించుచు నున్న మోదమొకలేశమునొందక భోగతృష్ణ ప్రా
పించిన మూర్తియో యనఁగ భీకరవృత్తిఁ జరించునిచ్చలున్.

సీ. అది యట్లు వర్తింప నానాఁటి కానాఁడు
తత్కోప పరితాపతప్తుఁ డగుచు
విసిగి వేసరి యిల్లు విడిచి సింహపరాక్ర
ముఁడు వింధ్యవాసిని మ్రోల కరిగి
నియతి నిరాహారుఁ డయి తజ్జగన్మాతఁ
బ్రార్థింప వానిస్వప్నమున నామె
ప్రత్యక్షమై "కుమారా! నీవు వెండియుఁ
బొమ్ము వారాణసీపురికి నచటఁ

గీ. గలదొక మహావటం బందుఁ గల సమస్త
వృక్షములకంటెఁ బెద్దయై, వింటె! దాని
మొదలఁ ద్రవ్విన నొకనిధి యొదవు నీకు
మఱియు నాస్వర్ణమయ నిధి మధ్యనుండు. 31

క. గారుడ మాణిక్యమయం
బై రహిఁ నిస్త్రింశ నిర్మలాకృతియై యొ
ప్పారు నొకరత్నపాత్రిక
జాఱిపడిన సురుచిరాభ్రశకలంబో యనన్. 32

ఆ. కానఁబడును; దానిఁ గైకొమ్ము తత్పాత్రి
యందు దృష్టిఁ బఱపి యరయుదేని
దెలియవచ్చు నీకుఁ దెల్లంబుగా సర్వ
జంతు పూర్వజన్మ చరితములును. 33

వ. కావునఁ దత్పాత్రింబువలన నీకళత్రంబును నీవును దొల్లింటి జన్మంబున నేయేజాతివారలై యున్నయదియుం దెలిసికొని విగతఖేదుండవై నిధానార్థలాభంబునం బ్రవృద్ధమోదుండవై యందు సుఖంబుగా నివసించుచుండు"మని చెప్పి యరిగిన తత్క్షణంబ మేల్కొని సింహపరాక్రముండు పరమానంద భరితుండై నిజోపవాసదీక్ష విసర్జించి నిర్వర్తితపారణుండై ప్రాతఃకాలంబున వారాణసీపురంబున కరుగ సమకట్టి ప్రయాణంబై వెడలి కొంతతడవున కప్పురంబుఁ జేరుకొని వింధ్యవాసినీదేవి యానతిచ్చినచందంబున నమ్మహాన్యగ్రోధ పాదపమూలంబునం గల నిధానంబును దన్మధ్యంబునం గల గరుడమాణిక్యమయమహాపాత్రంబునుం బడసి. 34

ఆ. కనియె నందుఁ బూర్వజనిఁ దనసతి ఘోర
భల్లుకీస్వరూపభరిత యగుచు
మెలఁగుటయును, దాను మృగరాజమూర్తియై
వెలయుటయును మిగుల విస్మయముగ. 35

చ. కని యిది పూర్వజాతివశకల్పితవైరముగాని, నేఁడు వ
చ్చినయది కాదు; కావుననె చేడ్పడ కిట్లు సునిశ్చలంబుగా

తనయము నాకు నానతికి నయ్యది పెంపగుచుండె; నంచు నె
మ్మనమున నిశ్చయించుకొని మానక క్రమంబుగఁ దద్విచారమున్

సీ. పదపడి తద్రిత్నపాత్రిపరిభావంబు
వలనఁ బెక్కండ్రఁ గన్యలను బూర్వ
జన్మకాలవిభిన్నజాతులుగా నిర్ణ
యించి వారల విసర్జించి తుదకుఁ
దనతోడఁ దుల్యతం దగి ప్రాగ్భవంబున
సింహియై యొప్పిన చెలి నొకర్తు
సరసి యద్దాని సింహశ్రీ యనెడు దొడ్డ
పేరఁ బొల్చినదానిఁ బెండ్లియాడి

గీ. కలహకారిణి కనువగు గ్రాసవాస
ములను మాత్ర మొసంగుచు ముదము మీఱ
నభినవ వధూమణీపరిణయమున నలరె
నిధి సమాప్త సమృద్ధార్థ నిచయుఁ డగుచు. 87

వ. ఇవ్విధంబుననే యోమహారాజా! యీలోకంబున సమస్త మానవులకును బుత్రమిత్రకళత్రాదులు ప్రాగ్జన్మవాసనావశాయాతస్నేహవైరానుబంధంబులు గలవారై యుందు రని విదూషకుం డీచిత్రకథ నిట్లు సెప్పిన విని వత్సేశ్వరుండు వాసవదత్తాదేవితో మిగులఁ బ్రమోదంబు నొందె; నట్లా మహీవల్లభుండు దివానిశంబును సముల్లసద్గర్భ పాండురదేవీ ముఖేందు సందర్శనాతృప్తహృదయుండై యుండ, నంతఁ

గొన్నిదినంబులు గడచునంతయు నప్పు డమ్మహీకాంతుని మంత్రుల కెల్లరకును గ్రమంబుగ శుభలక్షణలక్షితులును, భావికల్యాణవైభవసూచకులు నగు కుమారు లుద్భవించి రది యెట్లనిన :— 38

— మంత్రికుమారులజననము. —

సీ. మున్ముందు తన్మంత్రిముఖ్యుఁడౌ యౌగంధ
రాయణునకుఁ గుమారకుఁడు వొడమె
మరుభూతి యనఁగ; రుమణ్వంతునకు నంత
హరిశిఖాఖ్యం డుదయంబు నొందెఁ;
దదనంతరము వసంతకునకు జనియించెఁ
దగినపుత్త్రుఁడు తపంతకుఁ డనంగ
నవల నిత్యోదితుం డను ప్రతీహారము
ఖ్యున కిత్యకాన్యనజునకు సుతుఁడు
గీ. గలిగె గోముఖుఁ డనుపేర వెలయువాఁడు
తత్కుమారకు లిట్లు లందఱును బుట్టు
వేళలం దెల్ల నాకాశవీధినుండి
ప్రస్ఫుటంబుగ నశరీరవాణి వెడలి. 39

— నరవాహనదత్తజననము. —

వ. ఇక్కుమారకులందఱును భవిష్యచ్చక్రవర్తి యగు వత్సరాజ తనూభవునకు మంత్రులై తదీయ వైరివంశావమర్దకులయ్యె

దరని పలికె; నంత మఱికొన్నిదివసంబుల కవ్వత్సరాజ మహిషి యాసన్నప్రసవోదయయ్యె, వివిధ పుత్త్రివతీ పరిష్కృతంబును బహుతరార్క్షశమీగుప్తగవాక్షకసమన్వితంబునై రత్నదీపప్రభాసంగమంగళంబులైన వివిధాయుధసమూహంబులచే గర్భరక్షాక్షమంబైన తేజోవిశేషంబు నుజ్జ్వలింపఁ జేయుచున్న చందంబున నందంబై మంత్రిజనతంత్రితానేక మంత్రతంత్రిసమన్వితంబై దురితదుర్లయంబైన మాతృగణ దుర్గంబునుంబోలి విచిత్రంబైయున్న సూతికాగృహంబు నధివసించి. 40

చ. అమృతమయంబులైన శిశిరాంశువులన్ విలసిల్లు పూర్ణచం
ద్రముని వియద్వధూమణిసముదంబడరన్ బ్రసవించుమాడ్కి ను
త్తమ సుముహూర్తకాలమునఁ దద్వసుధేశ్వరపత్ని భవ్యకాం
తి మహితు దర్శనీయనిజదివ్యగుణోన్నతుఁ గాంచెనత్సుతున్.

చ. అనితరదుర్లభం బయిన యద్భుతతేజముతోడ నట్టు లా
తనయుఁడు సంభవించుటయుఁ దద్భవనంబు నుమాతృమానసం
బును గత తామసంబులయి పొల్చెఁ; బదంపడి దానదాసికా
జన నివహ ప్రమోదము లెసంగె నృపావసథాంతరంబునన్. 42

వ. అంత. 43

క. జనవిభుఁడు నిజాభ్యంతర
జనములవలనం గుమారజనన సువార్తన్

నిని పరమానంద సుధాం
బు నిధి మునింగి యోలలాడె బుధులు నుతింపన్. 44

వ. అయ్యనంతరంబున— 45

ఉ. వేడుక మీఱఁ దత్ప్రియనివేదనమున్ దొలుదొల్త వచ్చి యె
వ్వాఁడొనరించె నట్టిశుభవక్త్రకు రాజ్యమొయీయనెంచియు
బాడిఁ దలంచి యాచితిక భంగము వాటిలకుండునట్లుగాఁ
బైఁడియురత్నముల్ మఱియుఁబట్టుసుకూలవిభూషణాదులన్.

క. తనియఁగ నిడి యంతఃపుర
మున కేఁగి నిజాత్మజునిఁ బ్రమోదమ్మునఁ గ
న్గొని నవ్వసుధాధీశుఁడు
తనసంకల్పంబు సఫలతఁ గని; మఱియున్. 47

సీ. తరళరక్తాయతాధర దళాంచిత మయి
సంచల దూర్ణాపశ్రిస్త చారు
కేసరశోభిమై కేవల సామ్రాజ్య
లక్ష్మీకరస్థ లీలాసరోజ
సన్నృశతఁ బొల్చు ప్రసన్నవక్త్రమ్మును,
బరన్నృపాలశ్రీలు భయవశమున
ముందె వీడిన చిహ్నము లోకోయనం దగు
ఛత్రచామరజలజముల నొప్పు

గీ. మృదుళ పదయుగమును దాల్చి మిసిమిమేని
సోయగమ్మునఁ దనరు తత్సూను హర్ష

పూర సంపూర్ణతరసముత్ఫుల్ల దృష్టిఁ
గనియె నెమ్మది నేమియుఁ దనివి నవక. 48

ఆ. ప్రియతనూజుమీఁది ప్రేముడి యుబ్బంగఁ
గరఁగి బిందువులుగఁ దొరఁగఁబోలు
నాఁగ నృపతిలోచనములవెంబడి హర్ష
బాష్పకణచయమ్ము పరఁగె నంత. 49

వ. యౌగంధరాయణాదిమహామంత్రివర్గంబును బరమానందంబు
నొందెఁ దత్సమయంబున. 50

సీ. తెలియుఁ; డీతఁడు కామదేవావతారుండు
గాని సామాన్యుండు గాఁడు; మఱియు
వసుధ నీతని నరవాహనదత్తాభి
ధానంబునన్ బిల్వఁ దగు; సతంబు
సర్వవిద్యాధరేశ్వరచక్రవర్తియై
యొక దివ్యకల్ప మీయుర్వి నితఁడు
వెలయు, నిత్యైశ్వర్య విభవంబు దీపింప
నితఁ డొప్పు ధరణి దేవేంద్రుకరణి

గీ. ననుచు నాకసముననుండి యరుగుదెంచె
నొక సరస్వతి; యదియును నుడుగునంతఁ
గురిసె వికసిత సురభిళ కుసుమ వృష్టి
మొరసె సురదుందుభి నినాదములు క్రమముగ. 51

వ. అంత:—— 52

క. సురకృతపుష్పారంభ
త్వరితాత్యాదరవశమున వత్సేశ్వరుఁడుం
బరితుష్టుఁ డగుచు నయ్యెడఁ
బరమోత్సవముం బొనర్పఁ బంచెఁ బురమునన్. 53

వ. అట్టి యామహోత్సవసమయంబున:— 54

చ. ఉరవుగ మందిరాంగణములందు బడింబడి యుప్పతిల్లి యు
ప్పరమున మ్రోయుచుండె ఘనవాద్యరవంబులు వత్సమేదిని
శ్వరసుతజన్మలాభశుభవార్త దివస్థితులైన సర్వఖే
చరులకు విన్నవింపఁ జను చాడ్పున మిక్కిలి పిక్కటిల్లుచున్.

వ. అదియునుంగాక, 56

మ. ఘనసౌధాగ్రసముచ్ఛ్రితారుణపతాకాశ్రేణి మందానిలం
బున నిట్టట్టు చలించుచున్ నిగుడుచిన్ బొల్పొందె నయ్యుత్సవం
బున నవ్యోన్నయ సౌగతానునయనోద్యానంబునన్ బోలె సిందూరగం
జనముల్ నల్లుకొనంగ వాడ నగనౌకానాక సంశోభిలెన్ నల్గడన్.

క. ధరణి ననంగుఁడు సాంగత
మరల జనించె ననువేడ్క మహిమండలిపై
కరుదెంచిన యచ్చరగమి
కరణిన్ నటియించె వారకాంతాగణముల్. 58

సీ. వివిధమంగళవస్తు విస్తారపూర్ణలై
దర్శితస్వాచారదక్షత లయి

నయనాభిరమణీయనగరౌపగ లయి
యుచిత లసత్ప్రభృతోత్తర లయి
వర్ధిత సంపూర్ణవైభవ ప్రాభవా
ధిక మహారక్షకాధిష్ఠిత లయి
యభితః ప్రస్తుతమంగళాతోద్య గంభీర
నిర్హ్రాద లక్ష్మి వినిర్భర లయి

గీ. తన్మహోత్సవ దర్శనోత్సాహవశత
నచట సాక్షాత్కరించిన యఖిలదిశల
మాడ్కిఁ జనుదెంచి రపుడు సామంత భూమి
భృదవరోధ సుధాధామబింబముఖులు. 59

సీ. అంతఁ దత్పురవరం బంతయుఁ దుల్యవై
భవ సమృద్ధిఁ దనర్చె వగిది నొప్పె
నంతోషమున వత్సజననాథుఁ డొసఁగిన
నవవస్త్రభూషణోన్నతి ధరించి
మతియుఁ నవ్వసుమతీశ్వరుఁడు వర్షించిన
కాంచన వర్షంబు కారణమున
ధన విహీనుం డైన జనుఁ డొకండును గాన
రాకుండెఁ దన్నగరమున నపుడు

గీ. చేష్ట నృత్తమయంబు, భాషితము పూర్ణ
పాత్రమయము, వ్యాపారంబు బహుళదాన

మయము, శబ్దంబు శుభతూర్యమయము, లోక
మభినవానందమయము నై యలరె నపుడు. 60

వ. ఇవ్విధంబున నమ్మహోత్సవంబు బహువాసరవర్ధితంబై పరిపూర్ణంబు లైన పౌరజనమనోరథంబులతోడం బరివర్తిల్లె; నా రాజపుత్త్రుండును బ్రతిపదిందుండునుంబోలె దివసక్రమంబున వర్ధిల్లుచు, దివ్యవాణీ నిర్దిష్టపూర్వం బైన నరవాహనదత్తనామధేయంబు తనజనకునిచే యథావిధి నివేదితంబై ప్రఖ్యాతంబు గాఁగ విలసిల్లఁ దొడంగె నంత. 61

గీ. ముగ్ధమసృణనఖప్రభంబులు, ఖచద్ద
శన నవాంకురములు పరిస్ఖలన విలసి
తములు నగు నిజపుత్త్రుపదములు గనియు
వినియుఁ దలిదండ్రు లెంతయు వేడ్కఁ గనిరి. 62

వ. పదంపడి యవ్వత్సేశ్వరునకు హృదయాహ్లాదంబుగా యౌగంధరాయణ రుమణ్వద్వసంతకేత్యకులు తమతమకుమారులం గ్రమంబుగ మరుభూతి హరిశిఖ తపంతక గోముఖు లనువారి నబ్బాలప్రభువునకు సహచరులుగా సమర్పించి రప్పుడు పురోహితుండైన శాంతికరుండును నిజభ్రాతవలనఁ బింగళికయం దుద్భవించిన శాంతిసోమ వైశ్వానరులను గవలలం గొనివచ్చి యర్పించెఁ; దత్క్షణంబ నభస్స్థలంబునుండి నాందీనినాదసుభగం బైన దివ్యపుష్పవర్షంబును గురిసె; వత్సేశ్వరుండు నిజ

ఉ. సాధుకవిత్వలక్షణవిచక్షణ! దీనజనైకరక్షణా!
శోధితకావ్యజాల! పరిశుద్ధమనోజ్ఞగుణాలవాల! ల
క్ష్మీధరణీసుమిత్ర! గుణచిహ్నిత వేదవతీకళత్ర! గం
గాధరరామరాయ! కవిగాయకగేయ మహామహోదయా!
రావువంశాబ్ధి తారాపతీ! సాహితీ
శేవధీ! ధర్మసంసేవనాసక్తధీ!
శ్రీవిశేషాంచితా! చిన్నమాంబాసుతా!
దేవరాడ్వైభవా! దివ్యదాతోద్భవా! 69

ఇది శ్రీ భారతీ కరుణాకటాక్ష లబ్ధ కవితాభినివేశ సమాసాదిత
శ్రీమత్పిఠికాపురీ మహాసంస్థానకవీశ్వరత్వ పదవీ సమలంకరిష్ణు
లగు వేంకటరామకృష్ణులచే విరచితంబైన యాంధ్ర
కథాసరిత్సాగరంబున నరవాహనదత్త జనన లంబ
కంబునఁ తృతీయతరంగంబు సమాప్తము.

శ్రీ శ్రీ శ్రీ.

